శ్రీ శృఙ్గేరీ శారదామ్బాయై నమః







# శ్రీ శ్రీ జగద్గురు శఙ్కరాచార్య మహా సంస్థానమ్

దక్షిణామ్నాయ శ్రీ శారదాపీఠమ్, శృంగేరీ.

# శ్రీ క్రోధి నామ సంవత్సర పఞ్చాఙ్గమ్



జగద్గురు శ్రీమదభినవ విద్యాతీర్థ మహాస్వామినః



జగద్గురు శ్రీ భారతీతీర్థ మహాస్వామినః



జగద్గురు శ్రీ విధుశేఖర భారతీ మహాస్వామినః

పఞ్చాఙ్గమిదం - శ్రీమచ్చింతలపాటివంశ పయః పారావార రాకాసుధాకర,
"విద్వద్దైవజ్ఞభాస్కర"

**బ్ర॥వే॥ శ్రీ వీర నీలకంఠ కుటుంబరామశాస్త్రి సిద్ధాన్తి** నామాత్మజైః

"శివసోమసున్దరమాధవదత్తమూర్తి సిద్ధాన్తినా,

హరిసూర్యసుబ్రహ్మణ్య సిద్ధాన్తినా, హరినారాయణకృష్ణ సిద్ధాన్తినా" చ

విరచితం, కుణ్డినసీమాన్తర్వర్తి కొప్పురపురే.

కొప్పురం పోస్టు, సంతమాగులూరు మండలం,

బాపట్ల జిల్లా, ఆంధ్రప్రదేశ్





**2024 - 2025**





శ్లో॥ శారదా శారదామ్భోజ వదనా వదనామ్బుజే ।
సర్వదా సర్వదాఽస్మాకం సన్నిధిః సన్నిధిం క్రియాత్ ॥



శ్లో॥ శఙ్కరరూపేణ మచ్చిత్తం పఙ్కీకృతమభూద్యయా ।
కిఙ్కరీ యస్య సా మాయా శఙ్కరాచార్యమాశ్రయే ॥

శ్లో॥ వివేకినం మహాప్రజ్ఞం ధైర్యౌదార్యక్షమానిధిమ్ ।
సదాఽభినవ పూర్వం తం విద్యాతీర్థ గురుం భజే ॥



శ్లో॥ భారతీ కరుణా పాత్రం భారతీ పద భూషణమ్ ।
భారతీ పదమారూఢం భారతీతీర్థమాశ్రయే ॥



శ్లో॥ విద్యావినయ సమ్పన్నం వీతరాగం వివేకినమ్ ।
వన్దే వేదాన్త తత్త్వజ్ఞం విధుశేఖర భారతీమ్ ॥







శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య,
పదవాక్యప్రమాణపారావారపారీణ,
యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణా ధ్యాన-
-సమాధ్యష్టాంగ యోగానుష్ఠాననిష్ఠ,
తపశ్చక్రవర్తి,
అనాద్యవిచ్ఛిన్న శ్రీశంకరాచార్య గురుపరంపరా ప్రాప్త,
షడ్దర్శన స్థాపనాచార్య,
వ్యాఖ్యాన సింహాసనాధీశ్వర,
సకలనిగమాగమ సారహృదయ,
సాంఖ్యత్రయ ప్రతిపాదక,
వైదిక మార్గ ప్రవర్తక,
సర్వతంత్ర స్వతంత్ర,
ఆది రాజధానీ విద్యానగర మహారాజధానీ-
-కర్ణాటక సింహాసన ప్రతిష్ఠాపనాచార్య,
శ్రీమద్రాజాధిరాజ గురుభూమండలాచార్య,
ఋష్యశృంగపురవరాధీశ్వర,
తుంగభద్రాతీరవాసి,
శ్రీమద్విద్యాశంకర పాదపద్మారాధక,
శ్రీమజ్జగద్గురు
శ్రీమదభినవ విద్యాతీర్థ మహాస్వామి గురుకరకమల సంజాత,
శ్రీమజ్జగద్గురు
శ్రీమత్ భారతీతీర్థ మహాస్వామినాం,
తత్కరకమల సంజాత శ్రీమజ్జగద్గురు
శ్రీవిధుశేఖర భారతీ స్వామినాం చ,
చరణారవిందయోః
సాష్టాంగ ప్రణామాన్ సమర్పయామః.

శ్రీరస్తు
శ్రీగురుభ్యోనమః

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥

శ్లో॥ గురవే సర్వలోకానాం బిషజే భవరోగిణాం ।
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః ॥

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరం బ్రహ్మ తస్మై శ్రీగురవే నమః ॥

శ్లో॥ జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిం ।
ఆధారం సర్వ విద్యానాం హయగ్రీవముపాస్మహే ॥

శ్లో॥ సదాశివసమారంభాం శంకరాచార్యమధ్యమాం ।
అస్మదాచార్యపర్యంతాం వందే గురు పరంపరామ్ ॥


సర్వలోకగురుః
శ్రీ మేధాదక్షిణామూర్తిః

## గురుపరంపరా స్తోత్రమ్

శ్లో॥ శుద్ధస్ఫటిక సంకాశం శుద్ధ విద్యా ప్రదాయకం ।
శుద్ధం పూర్ణం చిదానందం సదాశివమహం శ్రయే ॥

శ్లో॥ సీమాతీతమనాద్యంతం నామోచ్చారణ భేషజం ।
కామితాశేషఫలదం శ్రీమద్విష్ణుమహం శ్రయే ॥

శ్లో॥ యోగిహృత్పద్మనిలయం నత జీవ హితే రతం ।
శ్రుతీనాం జన్మభూమిం తం చతుర్ముఖమహం శ్రయే ॥

శ్లో॥ ప్రసమాహితమత్యంతం ప్రథిమామిత తేజసం ।
వశీకృతపరానందం వసిష్ఠం గురుమాశ్రయే ॥

శ్లో॥ శుక్తౌ రూప్యమివాభాతి యద్రూపం మయి కల్పితం ।
శక్త్యా పరిహృతం యేన శక్తిం తం గురుమాశ్రయే ॥

శ్లో॥ కరణాతీతచిద్రూపం పరిపూర్ణం పరాయణం ।
పరమానందసంతుష్టం పరాశరమహం శ్రయే ॥


భగవాన్
శ్రీ వేదవ్యాస మహర్షిః

శ్లో॥ వేదవ్యాసం స్వాత్మరూపం సత్యసంధం పరాయణం ।
శాంతం జితేంద్రియక్రోధం సశిష్యం ప్రణమామ్యహమ్ ॥

శ్లో॥ త్రికాలాతీతచిన్మాత్ర ప్రశాంతస్వాంతసంయుతం ।
వికారాద్యైరసంస్పృష్టం శుకం గురుమహం శ్రయే ॥

శ్లో॥ గూఢా మాయా యస్య వాక్యైర్వ్రీడితా విలయం గతా ।
క్రీడంతం విద్యయా సార్ధం గౌడపాదం తమాశ్రయే ॥

శ్లో॥ జీవేశభేదరహితం నావికం భవవారిధేః ।
భావాభావ విదూరస్థం గోవిందం గురుమాశ్రయే ॥


జగద్గురు
శ్రీ ఆదిశంకరాచార్యాః

శ్లో॥ శంకారూపేణ మచ్చిత్తం పంకీకృతమభూద్యయా ।
కింకరీ యస్య సా మాయా శంకరాచార్యమాశ్రయే ॥

శ్లో॥ విశ్వం మాయామయత్వేన రూపితం యత్ప్రబోధతః ।
విశ్వం చ యత్స్వరూపం తం వార్తికాచార్యమాశ్రయే ॥

శ్లో॥ అనాద్యవిద్యాముత్సార్య ప్రజ్ఞానఘనరూపతాం ।
యో బోధయతి సచ్ఛిష్యాన్ తం బోధఘనమాశ్రయే ॥

శ్లో॥ సితాఘనాది దృష్టాంతైః యత్స్వరూపం శ్రుతిర్జగౌ ।
ప్రజ్ఞానఘన ఏవేతి తం జ్ఞానఘనమాశ్రయే ॥

శ్లో॥ జ్ఞానానాముత్తమం జ్ఞానం జ్ఞానినాముత్తమో యతః ।
జ్ఞానోత్తమ ఇతిఖ్యాతం గురుం తమహమాశ్రయే ॥

శ్లో॥ జ్ఞాననిశ్రేణిమాలంబ్య బ్రహ్మాఖ్యం గిరిమున్నతం ।
ఆరుహ్య కృతకృత్యో యః తం జ్ఞానగిరిమాశ్రయే ॥

శ్లో॥ దుర్వాది దుష్టమాతంగవిదారణ పటీయసే ।
నమశ్శ్రీ సింహగిరయే గురవే దివ్యచక్షుషే ॥

శ్లో॥ ఈప్సితార్థప్రదో నిత్యం ప్రణతానాం చ దేహినాం ।
యతిరీశ్వరతీర్థాఖ్యః. తం నమామి గురుం శివమ్ ॥

శ్లో॥ శ్రుతిమస్తక కూటస్థమజ్ఞానద్విపభేదినం ।
శ్రీ మంత్రరాజమూర్తిం తం నృసింహం గురుమాశ్రయే ॥

శ్లో॥ అవిద్యాచ్ఛన్నభావానాం నృణాం విద్యోపదేశతః ।
ప్రకాశయతి యస్తత్త్వం తం విద్యాతీర్థమాశ్రయే ॥

శ్లో॥ అజ్ఞానాం జాహ్నవీ తీర్థం విద్యాతీర్థం వివేకినాం ।
సర్వేషాం సుఖదం తీర్థం భారతీతీర్థమాశ్రయే ॥

శ్లో॥ అవిద్యాఽరణ్య కాంతారే భ్రమతాం ప్రాణినాం సదా ।
విద్యామార్గోపదేష్టారం విద్యారణ్య గురుం శ్రయే ॥

శ్లో॥ విద్యాఽవిద్యావివేకేన పారం సంసార వారిధేః ।
ప్రాపయత్యనిశం భక్తాన్ తం విద్యారణ్యమాశ్రయే ॥

శ్లో॥ అవిద్యాఽరణ్య సంక్లేశ కృశాను భృశతాపితః ।
సంశ్రయే సతతం భూత్యై చంద్రశేఖర చంద్రికామ్ ॥

శ్లో॥ అవిద్యాఽఖ్య ద్వీపద్వైధీభావే దక్షం సమాశ్రయే ।
నృసింహభారతీశాఖ్య హరిం శ్రుతిగుహాశ్రయమ్ ॥

శ్లో॥ పురుషోత్తమతాం యాంతి యమాశ్రిత్య జనాశ్శ్రయే ।
క్షరాక్షరమతీతం తం పురుషోత్తమ యోగినమ్ ॥



జగద్గురు
శ్రీ సురేశ్వరాచార్యాః



జగద్గురు
శ్రీ విద్యారణ్య
మహాస్వామినః



జగద్గురు
శ్రీ సచ్చిదానంద
భారతీ మహాస్వామినః

శ్లో॥ కింకరీకృత భూపాలం పంకేరుహ సమాననం ।
తం కారుణ్యపయోరాశిం శంకరాఖ్యం గురుం శ్రయే ॥

శ్లో॥ చంద్రికాధవళోదార సాంద్రకీర్తిచ్ఛటాధరం ।
ఇంద్రియైర్దుర్జయం నౌమి చంద్రశేఖర భారతీమ్ ॥

శ్లో॥ ప్రసిద్ధ విద్యానిలయమసమాన గుణోత్కటం ।
బిసజాక్షార్చకం భక్త్యా నృసింహం తీర్థమాశ్రయే ॥

శ్లో॥ పురుహూతాది దేవౌఘ పౌరుషేయ గుణోత్కటం ।
పురుషార్థప్రదం నౌమి పురుషోత్తమ యోగినమ్ ॥

శ్లో॥ కామద్విరద పంచాస్యరామణీయక మందిరం ।
సోమోపమాననం శ్రీమద్రామచంద్ర గురుం భజే ॥

శ్లో॥ సురసింధు లసత్కీర్తిం స్మరసింధుఘటోద్భవం ।
నారసింహార్చకం శ్రీమన్నారసింహ యతిం భజే ॥

శ్లో॥ సారాఽసార వివేకజ్ఞం మారకాననకుంజరం ।
శూరం దానే చ నిరతం నారసింహయతిం భజే ॥

శ్లో॥ నృసింహతాం ప్రయాంత్యాశు యమాశ్రిత్య జనా భువి ।
తం నృసింహగురుం వందే ద్విగుణోపపదం సదా ॥

శ్లో॥ తం సర్వభూతాభయదం విభవైరన్వితం పరం ।
నారసింహం గురుం చాపి నవం జ్ఞానార్ణవం భజే ॥

శ్లో॥ సత్యస్వరూపం సజ్జ్ఞాన నిష్ఠం సాక్షాచ్ఛివం పరం ।
సదా దానరతం దాంతం సచ్చిదానందమాశ్రయే ॥

శ్లో॥ మహామేరు సమం ధైర్యే మాధుర్యేఽప్యమృతోపమం ।
ఊహాపోహార్థ నిష్ణాతం నారసింహ గురుం భజే ॥

శ్లో॥ సచ్చిత్తాంబుజ మిత్రాయ సచ్చరిత్రయుజే నమః ।
సచ్చిదానంద భారత్యై సచ్చిదానంద మూర్తయే ॥

శ్లో॥ సచ్చిదానంద భారత్యై నవ్యాయాస్తు నమోఽనిశం ।
భవ్యాత్మ జ్ఞాన నిర్ధూతావిద్యా కార్యోపలబ్ధయే ॥

శ్లో॥ మార మాతంగ పంచాస్యం మదసర్ప ద్విజర్షభం ।
నృసింహ భారతీం వందే జితాక్ష తురగం సదా ॥

శ్లో॥ తత్త్వమస్యాది వేదాంత వాక్యార్థ జ్ఞాన వారిధేః ।
పూర్ణ చంద్రమసం వందే సచ్చిదానంద యోగినమ్ ॥

శ్లో॥ అభినవ పద పూర్వాన్ సచ్చిదానంద సంజ్ఞాన్
నిగమ శిఖర వేద్యాన్ నిత్య కళ్యాణ రూపాన్ ।
త్రిభువన జన వంద్యాన్ సర్వ లోకైక హృద్యాన్
హృదయ కమల మధ్యే భావయామ్యంబుజాఽస్యాన్ ॥



జగద్గురు
శ్రీ నృసింహ భారతీ
మహాస్వామినః



జగద్గురు శ్రీ
సచ్చిదానంద శివాభినవ
నృసింహ భారతీ
మహాస్వామినః



జగద్గురు
శ్రీ చంద్రశేఖర భారతీ
మహాస్వామినః

శ్లో॥ ప్రహ్లాద వరదో దేవో యో నృసింహః పరో హరిః ।
నృసింహోపాసకం నిత్యం తం నృసింహ గురుం భజే ॥

శ్లో॥ శ్రీ సచ్చిదానంద శివాభినవ్య నృసింహ భారత్యభిధాన్ యతీంద్రాన్ ।
విద్యానిధీన్ మంత్రనిధీన్ సదాఽఽత్మ నిష్ఠాన్ భజే మానవ శంభు రూపాన్ ॥

శ్లో॥ సదాఽఽత్మ ధ్యాన నిరతం విషయేభ్యః పరాఙ్ముఖం ।
నౌమి శాస్త్రేషు నిష్ణాతం చంద్రశేఖర భారతీమ్ ॥



జగద్గురు
శ్రీమదభినవ విద్యాతీర్థ
మహాస్వామినః

శ్లో॥ వివేకినం మహా ప్రజ్ఞం ధైర్యౌదార్యక్షమా నిధిం ।
సదాభినవ పూర్వం తం విద్యాతీర్థ గురుం భజే ॥

శ్లో॥ అజ్ఞానాం జాహ్నవీ తీర్థం విద్యాతీర్థం వివేకినాం ।
సర్వేషాం సుఖదం తీర్థం భారతీతీర్థమాశ్రయే ॥

శ్లో॥ భారతీతీర్థ నామ్నా యో భాభిస్సందీపయన్ జగత్ ।
ఆజ్ఞాన ధ్వాంత సంఛేత్తా జయత్యద్య జగద్గురుః ॥

శ్లో॥ ఋష్యశృంగ పురాధీశం తుంగాతీర నివాసినం ।
భక్తాఽఽమోద ప్రదం వందే భారతీతీర్థ సద్గురుమ్ ॥



జగద్గురు
శ్రీ భారతీతీర్థ
మహాస్వామినః

శ్లో॥ భారతీ కరుణాలబ్ధ తీర్థరాశిం తపోనిధిం ।
భక్తబోధప్రదం పూజ్యం భారతీతీర్థమాశ్రయే ॥

శ్లో॥ భారతీ కరుణా పాత్రం భారతీ పద భూషణం ।
భారతీ పదమారూఢం భారతీతీర్థమాశ్రయే ॥

శ్లో॥ విద్యా వినయ సంపన్నం వీతరాగం వివేకినం ।
వందే వేదాంత తత్త్వజ్ఞం విధుశేఖరభారతీమ్ ॥

శ్లో॥ శ్రీగుర్వవిచ్ఛిన్న పరంపరాయాం భూమండలాచార్యక సార్వభౌమాన్ ।
వ్యాఖ్యాన సింహాసన పట్టభద్రాన్ భజే గురూన్ శృంగపురీ మఠేశాన్ ॥

శ్లో॥ యత్పాద పూజన రతస్య మనీషితాఽఽప్తిః ప్రాత్యక్షికీ భవతి భక్తియుతస్య పుంసః ।
వాచాలయత్యపి చ మూకమహో యదీయసానుగ్రహేక్షణమమీ గురవో జయంతి ॥

శ్లో॥ ఆసేతుశీతాచల మధ్యవర్తి విద్వద్వరిష్ఠైస్సముపాస్యతే యః ।
వర్ణాశ్రమాచార విచార దక్షం శ్రీ దక్షిణామ్నాయ గురుం భజామః ॥

శ్లో॥ శ్రీ తుంగభద్రా తటినీ తటస్థ శ్రీ శారదా పీఠ కృత ప్రతిష్ఠాన్ ।
జగద్గురూంచ్ఛృంగపురీ యతీశాన్ భక్త్యా భజన్తస్సుఖినో భవంతి ॥

శ్లో॥ జయతు జయతు తుఙ్గాతీరగా శారదాంబా
జయతు జయతు శ్రీమచ్చంద్రమౌళిస్సురేడ్యః ।
జయతు జయతు విఘ్నేంద్రత్నగర్భో గణేశో-
జయతు జయతు శాస్త్రం జ్యౌతిషం వేదచక్షుః ॥



జగద్గురు
శ్రీ విధుశేఖర భారతీ
మహాస్వామినః

# శ్రీ శంకరాచార్య అష్టోత్తర శతనామావళిః

శ్లో॥ శ్రుతి స్మృతి పురాణానామాలయం కరుణాఽలయం ।
నమామి భగవత్పాద శంకరం లోక శంకరమ్ ॥

ఓం శంకరాచార్యవర్యాయ నమః
ఓం బ్రహ్మానంద ప్రదాయకాయ నమః
ఓం అజ్ఞానతిమిరాదిత్యాయ నమః
ఓం సుజ్ఞానాంబుధి చంద్రమసే నమః
ఓం వర్ణాశ్రమ ప్రతిష్ఠాత్రే నమః
ఓం శ్రీమతే నమః
ఓం ముక్తిప్రదాయకాయ నమః
ఓం శిష్యోపదేశనిరతాయ నమః
ఓం భక్తాభీష్టప్రదాయకాయ నమః
ఓం సూక్ష్మతత్త్వరహస్యజ్ఞాయ నమః ౧౦
ఓం కార్యాకార్యప్రబోధకాయ నమః
ఓం జ్ఞానముద్రాంచితకరాయ నమః
ఓం శిష్యహృత్తాపహారకాయ నమః
ఓం పరివ్రాజాశ్రమోద్ధర్త్రే నమః
ఓం సర్వతంత్రస్వతంత్రధియే నమః
ఓం అద్వైతస్థాపనాచార్యాయ నమః
ఓం సాక్షాచ్ఛంకరరూపభృతే నమః
ఓం షణ్మత స్థాపనాచార్యాయ నమః
ఓం త్రయీమార్గ ప్రకాశకాయ నమః
ఓం వేద వేదాంత తత్త్వజ్ఞాయ నమః ౨౦
ఓం దుర్వాదిమతఖండనాయ నమః
ఓం వైరాగ్యనిరతాయ నమః
ఓం శాంతాయ నమః
ఓం సంసారార్ణవతారకాయ నమః
ఓం ప్రసన్నవదనాంభోజాయ నమః
ఓం పరమార్థప్రకాశకాయ నమః
ఓం పురాణ స్మృతి సారజ్ఞాయ నమః
ఓం నిత్యతృప్తాయ నమః
ఓం మహతే నమః
ఓం శుచయే నమః ౩౦

ఓం నిత్యానందాయ నమః
ఓం నిరాతంకాయ నమః
ఓం నిస్సంగాయ నమః
ఓం నిర్మలాత్మకాయ నమః
ఓం నిర్మమాయ నమః
ఓం నిరహంకారాయ నమః
ఓం విశ్వవంద్యపదాంబుజాయ నమః
ఓం సత్త్వప్రధానాయ నమః
ఓం సద్భావాయ నమః
ఓం సంఖ్యాతీతగుణోజ్జ్వలాయ నమః ౪౦
ఓం అనఘాయ నమః
ఓం సారహృదయాయ నమః
ఓం సుధియే నమః
ఓం సారస్వత ప్రదాయ నమః
ఓం సత్యాత్మనే నమః
ఓం పుణ్యశీలాయ నమః
ఓం సాంఖ్యయోగవిచక్షణాయ నమః
ఓం తపోరాశయే నమః
ఓం మహాతేజసే నమః
ఓం గుణత్రయవిభాగవిదే నమః ౫౦
ఓం కలిఘ్నాయ నమః
ఓం కాలకర్మజ్ఞాయ నమః
ఓం తమోగుణ నివారకాయ నమః
ఓం భగవతే నమః
ఓం భారతీజేత్రే నమః
ఓం శారదాఽహ్వానపండితాయ నమః
ఓం ధర్మాధర్మవిభాగజ్ఞాయ నమః
ఓం లక్ష్యభేదప్రదర్శకాయ నమః
ఓం నాదబిందుకళాఽభిజ్ఞాయ నమః
ఓం యోగిహృత్పద్మభాస్కరాయ నమః ౬౦

ఓం అతీంద్రియ జ్ఞాననిధయే నమః
ఓం నిత్యానిత్యవివేకవతే నమః
ఓం చిదానందాయ నమః
ఓం చిన్మయాత్మనే నమః
ఓం పరకాయప్రవేశకృతే నమః
ఓం అమానుషచరిత్రాఢ్యాయ నమః
ఓం క్షేమదాయినే నమః
ఓం క్షమాకరాయ నమః
ఓం భవ్యాయ నమః
ఓం భద్రప్రదాయ నమః ౭౦
ఓం భూరిమహిమ్నే నమః
ఓం విశ్వరంజకాయ నమః
ఓం స్వప్రకాశాయ నమః
ఓం సదాధారాయ నమః
ఓం విశ్వబంధవే నమః
ఓం శుభోదయాయ నమః
ఓం విశాలకీర్తయే నమః
ఓం వాగీశాయ నమః
ఓం సర్వలోకహితోత్సుకాయ నమః
ఓం కైలాసయాత్రాసంప్రాప్త
చంద్రమౌళి ప్రపూజకాయ నమః ౮౦
ఓం కాంచ్యాం శ్రీచక్రరాజాఖ్య
యంత్రస్థాపన దీక్షితాయ నమః
ఓం చక్రాత్మకతాటంక
తోషితాంబామనోరథాయ నమః
ఓం శ్రీబ్రహ్మసూత్రోపనిషద్భాష్యాది
గ్రంథకల్పకాయ నమః
ఓం చతుర్దిక్చతురామ్నాయ ప్రతిష్ఠాత్రే నమః
ఓం మహామతయే నమః
ఓం ద్విసప్తతిమతోచ్ఛేత్త్రే నమః
ఓం సర్వదిగ్విజయప్రభవే నమః
ఓం కాషాయవసనోపేతాయ నమః
ఓం భస్మోద్ధూళిత విగ్రహాయ నమః
ఓం జ్ఞానాత్మకైక దండాఢ్యాయ నమః ౯౦
ఓం కమండలు లసత్కరాయ నమః
ఓం గురుభూమండలాచార్యాయ నమః
ఓం భగవత్పాదసంజ్ఞకాయ నమః
ఓం వ్యాససందర్శనప్రీతాయ నమః
ఓం ఋష్యశృంగపురేశ్వరాయ నమః
ఓం సౌందర్యలహరీముఖ్య బహుస్తోత్ర
విధాయకాయ నమః
ఓం చతుష్షష్టి కళాభిజ్ఞాయ నమః
ఓం బ్రహ్మరాక్షసమోక్షదాయ నమః
ఓం శ్రీమన్మండనమిశ్రాఖ్యస్వయంభూ
జయసన్నుతాయ నమః
ఓం తోటకాచార్యసంపూజ్యాయ నమః ౧౦౦
ఓం పద్మపాదార్చితాంఘ్రికాయ నమః
ఓం హస్తామలకయోగీంద్ర
బ్రహ్మజ్ఞానప్రదాయకాయ నమః
ఓం సురేశ్వరాఖ్యసచ్ఛిష్య
సన్న్యాసాశ్రమదాయకాయ నమః
ఓం నృసింహభక్తాయ నమః
ఓం సద్రత్నగర్భ హేరంబ పూజకాయ నమః
ఓం వ్యాఖ్యాసింహాసనాధీశాయ నమః
ఓం జగత్పూజ్యాయ నమః
ఓం శ్రీ జగద్గురవే నమః ౧౦౮
ఓం శ్రీ శంకర భగవత్పాదాచార్య
స్వామినే నమః

శ్లో॥ సదాశివ సమారంభాం శంకరాచార్య మధ్యమాం ।
అస్మదాచార్య పర్యంతాం వందే గురు పరంపరామ్ ॥



॥ श्री शृङ्गेरी श्रीजगद्गुरुमहासंस्थानम् ॥

[illegible]

॥ श्री जगद्गुरु शृङ्गेरी श्रीमद्भारतीतीर्थमहास्वामिभिः ॥

అస్మదత్యంత ప్రియశిష్య శ్రీచింతలపాటి శివ సోమసుందర మాధవ దత్తమూర్తి సిద్ధాంతివిషయే నారాయణస్మరణ పురస్సరం విరచితా ఆశిషస్సముల్లసంతు.

శ్రేయస్కాములైన సకలాస్తికులకు శ్రుతిస్మృత్యుదిత కర్మానుష్ఠానము అత్యావశ్యకమైయున్నది. విహిత కాలమందు ఆచరించిన కర్మలే ఫలప్రదములు. అట్టి కాలజ్ఞానము జ్యోతిశ్శాస్త్రాధీనము. అందువలననే వేదాంగములయందు జ్యోతిష్యము నేత్రస్థానీయముగ చెప్పబడియున్నది. కర్మసాక్షియగు సూర్య భగవానుడు ఉపదేశించిన సూర్యసిద్ధాంతానుసారము గుణింపబడిన తిథ్యాదులే సకల కర్మానుష్ఠానమునకు పరిగ్రాహ్యములు.

శృంగేరి జగద్గురు సంస్థానము ద్వారా ఆంధ్రదేశమునందు సూర్యసిద్ధాంతానుసారి పంచాంగము దీర్ఘకాలముగా ప్రకటింపబడుచున్నది.

మీ వంశములో వందల సంవత్సరముల నుండి సూర్యసిద్ధాంతానుసారి పంచాంగరచన జరుగుచున్నది. మీ తండ్రిగారగు డి.వీరనీలకంఠ కుటుంబరామ సిద్ధాంతిగారు పిత్రాది పరంపరా ప్రాప్తమగు పంచాంగ రచనను సుమారు ఏబది సంవత్సరములొనర్చి మహర్షికల్పులుగా నుండిరి. మీరును వారు ఉపదేశించిన రీతినే యనుసరించుచు పంచాంగరచన చేయుచుండుట మాకానందమును కలిగించినది. రాబోవు విలంబి నామ సంవత్సరము నుండి శృంగేరి జగద్గురు శ్రీమఠీయ ఆంధ్రపంచాంగ కర్తగా మిమ్ములను నియమించుచున్నాము. అస్మన్మఠ సంప్రదాయమునననుసరించి అస్మదాదేశానుసారము ఇక ముందు పంచాంగమును రచించుచూ శ్రేయోభాజనులగుదురుగాకయని ఆశీర్వదించుచున్నాము.

ఇతి నారాయణస్మరణం

శృంగేరి
హేమలంబ శ్రావణ కృష్ణ పంచమి
స్థిరవాసరము 12.8.2017

## ఇష్టదేవతా ప్రార్థనా



శ్లో॥ నిష్ప్రత్యూహముపాస్మహే పశుపతిం విష్ణుం విరిఞ్చిం శివాం
లక్ష్మీం వాగధిదేవతాం గణపతిం తణ్డుం కుమారం మునీన్ ।
సప్తాశ్వేన్దు కుజ జ్ఞ జీవ భృగుజచ్ఛాయాజ రాహు ధ్వజాన్
ఇంద్రాగ్న్యన్తక కోణపాప్పు పవన శ్రీదేశ్వరాంశ్చ ద్విజాన్ ॥

## శ్రీ రామచన్ద్ర పరమాత్మ స్తుతిః



శ్లో॥ శ్రీ సీతాకుచ కుమ్భ కుఙ్కుమ లసద్వక్షస్థలం నిర్జరైః
బ్రహ్మేన్ద్రాదిభిరర్చితాఙ్ఘ్రియుగళం సమ్పూర్ణ చన్ద్రాననమ్ ।
శ్రీమన్తం వరకొప్పరాఖ్య నగరీ సౌధాన్త సఞ్చారిణం
శ్యామాఙ్గం సుగుణాలవాలమనిశం శ్రీరామచన్ద్రం భజే ॥

## శివస్తుతిః



శ్లో॥ భో నన్దీశ ! నమోస్తు తే భగవతే విజ్ఞాపయేమం చ మాం
హేరమ్బాగ్నిభువౌ ! యువాం కథయతం పిత్రోర్మదీయాం దశామ్ ।
మాతర్గౌరి ! మహేశ్వరం త్వరయ మద్రక్షావిధౌ శఙ్కరం
మజ్జన్తం భవసాగరే కరుణయా మాం పాహి శమ్భో ! శివ ! ॥

శ్లో॥ 'విధే ! భూయోనైతం సృజ జగతి, విష్ణో ! కథమపి
త్వమేవైనం రక్ష, ద్రుతమపసరాస్మాద్రవిసుత !' ।
ఇతీమాఆజ్ఞాస్త్వం మయి కరుణయా దాస్యసి యథా
తథా శమ్భో ! చిన్తా దహతి మమ వై శుష్కహృదయమ్ ॥

## అమ్బాస్తుతిః



శ్లో॥ విద్వత్తా కవితా తథా చ ధనితా విఖ్యాతిమత్తాఽపి వా
మాతర్మాఽస్త్విహ మాఽస్తు మాఽస్తు మనసా వా నార్థయే తా ఇమాః ।
మత్తః కస్యచిదంబ మాఽస్తు నికృతిః కేనాపి నో మే భవే-
దేతావత్ప్రతిపాదయాభయమమే ! లోకాద్విభేమ్యాత్మని ॥

## హరిహరస్తుతిః



శ్లో॥ పదే వా శీర్షే వా పరివహతు నిత్యం సురనదీ
సుశయ్యా హారో వా భవతు భుజగానాం పరివృఢః ।
పయోధేర్వా వామే విలసతు గిరేర్వాఽపి చ సుతా
సఏకో మామవ్యాదఖిలజగదారాధ్యచరణః ॥

# శృఙ్గాద్రి జగద్గురుస్తుతిః

శ్లో॥ శృఙ్గాద్రిం రజతాచలాదుపగతం శ్రీచన్ద్రమౌళీశ్వరం
శ్రీమచ్ఛఙ్కర సేవితాం శుభయుజే శ్రీ శారదామ్బాం నుమః ।
తన్మూర్తిద్వయరూపిణోఽఖిలగురూన్ శ్రీభారతీతీర్థనా-
-మ్నశ్శ్రీమద్విధుశేఖరాభిధగురూన్ తత్పాణిపద్మోద్భవాన్ ॥

శ్లో॥ శృఙ్గాద్రిశ్చ విభాణ్డకాత్మజమునిస్తుఙ్గా చ శ్రీశఙ్కరా-
-చార్యో జ్ఞానద శారదా చ జననీ శ్రీచన్ద్రమౌళీశ్వరః ।
ఈశానో మలహానికృత్ గణపతీరత్నాన్వితస్తోరణ-
-స్థో రక్షన్తు జగద్గురూ చ, కృపయాఽస్మాన్ సర్వదా పూజితాః ॥

# గురు ప్రణామః

శ్లో॥ శ్రీమచ్చిన్తలపాటి వంశ విలసత్సిద్ధాన్త వారాంనిధేః
శీతాంశుం యమిహామనన్తి విబుధాః శ్రీ సూర్యనారాయణమ్ ।
తత్పుత్రస్య కుటుమ్బరామ విదుషో జ్యోతిర్గురోర్నః పితుః
సర్వజ్ఞస్య సదా పదామ్బుజయుగం భూయాదభీష్టప్రదమ్ ॥

# కర్తృ వంశావళిః

శ్లో॥ శ్రీమచ్చిన్తలపాటి వంశతిలకః శ్రీ పేరు భట్టాత్మజః
భారద్వాజ పవిత్ర గోత్ర జననస్సిద్ధాన్త శాస్త్రార్థవిత్ ।
యల్ల జ్యోతిషికాగ్రణీర్విజయతే వేదాఙ్గవిత్సత్యవాక్
పఞ్చాఙ్గం ప్రతివత్సరం ప్రకటయన్ శ్రీ కొణ్డవీటీపురే ॥
గోత్రాపత్యం తస్య వై సేతురామః ఖ్యాతో విద్వానత్రివత్తస్య పుత్రాః ।
వీరస్సోమస్సోమయార్యస్త్రయో వై సఞ్జ్యావన్తస్తత్ర వీరార్యసూరేః ॥
భద్రసున్దర సూరార్య కృష్ణయాప్పయనామకాః ।
ఖ్యాతాః పూతాః కోవిదాశ్చ బ్రహ్మిష్ఠాః పఞ్చసూనవః ॥
తత్ర సున్దరరామాఖ్యశాస్త్రిణస్తు సుతాస్త్రయః ।
సుబ్రహ్మణ్యసుధీర్జ్యేష్ఠః సూర్యనారాయణస్తథా ॥
ఆదిశేషావధానీ చ తత్ర తావగ్రజం వినా ।
దత్తౌ పితృవ్యయోరేవ విదుషోర్భద్ర కృష్ణయోః ॥
ఆదిశేషబుధస్యాత్మసమ్భవః పోషితస్తథా ।
పుత్రశ్చ శ్రీ సూర్యనారాయణ విద్వచ్ఛిరోమణేః ॥
శ్రీ వీరనీలకణ్ఠాదిః విఖ్యాతః కొప్పరేపురే ।
కుటుమ్బరామసిద్ధాన్తీ శుచిశ్శాన్తస్తపోధనః ॥
పితాఽస్మాకం సోదరాణాం షణ్ణాం జ్యోతిర్విదగ్రణీః ।
క్షయమాసవివేకాది గ్రన్థకృత్, బ్రహ్మవిత్కవిః ॥
"శివసోమసున్దరాదిమ మాధవదత్తా" భిధానోఽహమ్ ।
హరినారాయణకృష్ణః సుబ్రహ్మణ్యశ్చ మేఽనుజౌ భక్త్యా ॥
తత్పదాబ్జ యుగం ధ్యాత్వా తదుక్తేనైవ వర్త్మనా ।
పఞ్చాఙ్గం రచయామోఽద్య సూర్య సిద్ధాన్త సమ్మతమ్ ॥

**శ్రీ శివాయ గురవే నమః   శ్రీ గురుభ్యోనమః   శ్రీ మహాగణాధిపతయే నమః**

శ్లో॥ సదాశివ సమారమ్భాం శఙ్కరాచార్య మధ్యమాం ।
అస్మదాచార్య పర్యన్తాం వన్దే గురుపరమ్పరామ్ ॥

శ్లో ॥ శ్రీకల్యాణగుణావహం రిపుహరం దుస్స్వప్న దోషాపహం
గఙ్గాస్నాన విశేష పుణ్యఫలదం గోదానతుల్యం నృణామ్ ।
ఆయుర్వృద్ధిదముత్తమం శుభకరం సన్తాన సమ్పుత్రప్రదం
నానాకర్మసుసాధనం సముచితం పఞ్చాఙ్గమాకర్ణ్యతామ్ ॥

ఈ సంవత్సరము రాజు కుజుడు, మంత్రి శని. సేనార్ఘ మేఘాధిపత్యములు కూడా శనికి లభించినవి. సస్యాధిపతి కుజుడు. ధాన్యాధిపతి చంద్రుడు. రసాధిపతి గురువు. నీరసాధిపతి కుజుడు. నవనాయకులలో ఏడుగురు పాపులు, ఇరువురు మాత్రమే శుభులు. అందుచే దేశమున అలజడులు, ఈతిబాధలు అధికముగా నుండగలవు. పురోహితాది ఉపనాయకులలో మరియు అశ్వాధిపతి మొదలగు ఇతర నాయకత్వములలో పాపులు అధికముగనున్నందున ప్రశాంతత తక్కువ. రాజకీయ అశాంతి అధికము. గురు చంద్రులకు ఆధిపత్యము కలిగినందున తిరిగి ప్రశాంత పరిస్థితులు ఏర్పడగలవు. సస్యాధిపతి కుజుడయినందున ఎరుపు వర్ణము గల పంటలు బాగుగ పండును. ధాన్యాధిపతి చంద్రుడయినందున వర్షము, పాడిపంటలు సమృద్ధిగనుండును.

ఆర్ద్రా ప్రవేశము పగలు కలుగుటచే, ఆంధ్రదేశమునకు కొన్ని ఈతిబాధలు తప్పకపోవచ్చును. అధికఫలములు బాగున్నందున శుభఫలితమే చెప్పదగియున్నది. వర్షజగల్లగ్నములనాలోచించగా, దేశమున కొన్ని ఉపద్రవములు, అలజడులు కలుగునట్లున్ననూ, రెండు లగ్నములయందు శుభగ్రహదృష్టియున్నందున మొత్తం మీద దేశము సుఖశాంతులతో సుభిక్షముగానుండగలదు. ఈ సంవత్సరము వైశాఖ జ్యేష్ఠ శ్రావణ ఆశ్వయుజ, మార్గశిర మాఘ మాసములు ఉత్తమ ఫలప్రదములుగను, చైత్ర భాద్రపద పుష్యమాసములు మధ్యమముగను, ఆషాఢ కార్తిక ఫాల్గునములు క్లిష్టముగను ఉండగలవు.

ఈ సంవత్సరము చైత్రము ప్రారంభమున ఉష్ణతీవ్రత ఉండి మాసాంతమున తొలకరించును. వైశాఖమున వడగండ్లవానలు, పశ్చిమవాతాధిక్యము కలుగును. జ్యేష్ఠమాసం చివర బీజవాపానుకూల వర్షములు కలుగును. ఆషాఢ, శ్రావణ పూర్వార్ధములందు సస్యానుకూలవృష్టి, ఆశ్వయుజమున వాయుసహితవృష్టి కలుగును.

ఈ సంవత్సరము పశునాయకుడు యముడగుటచే పశువులకు కొంత పీడ కలిగిననూ, గోష్ఠాగారప్రాపకుడు, గోష్ఠాద్బహిఃప్రాపకుడు కూడా బలరాముడగుటచే అంతిమముగా పశువులకు క్షేమము, పాడిపంటల అభివృద్ధి కలుగును. ప్రత్యబ్దయోగపంచక ఫలములలో బాగున్నవి అధికమగుటచే వర్షములు పంటలు బాగుండును. ఆఢకము గణికాహస్తగతమగుటచే మంచి వర్షములుండును. వృద్ధ, యువ హస్తగతమగుటచే సుభిక్షం కలుగును. సముద్రచక్ర రోహిణీ నివాస ఫలము, సంవత్సరాధిపతి వాసఫలములు బాగున్నవి. చతుస్స్తంభ ఫలములలో కూడా అధికము బాగున్నందున ఎక్కువగా సుభిక్షము, క్షేమము, ఆరోగ్యము కలుగును.

చైత్ర బహుళ తదియ ప్రభృతి ఆషాఢ శుక్ల చతుర్థీ పర్యంతం ప్రాగస్తమిత శుక్రమౌఢ్యము. చైత్ర బహుళ ఏకాదశీ ప్రభృతి వైశాఖ బహుళ చతుర్దశీ పర్యంతం పశ్చాదస్తమిత గురుమౌఢ్యము. ఫాల్గున బహుళ చతుర్థీ ప్రభృతి ఫాల్గున బహుళ త్రయోదశీ పర్యంతం పశ్చాదస్తమిత శుక్రమౌఢ్యము. చైత్ర బహుళ ఏకాదశీ ప్రభృతి వైశాఖ బహుళ పంచమీ పర్యంతం వాస్తుకర్తరి. చైత్ర బహుళ దశమి నుండి **"రేవా (నర్మదా)"** నదీ పుష్కరారంభమగును. ఈ సంవత్సరము మన ప్రాంతమున కనిపించు గ్రహణములు లేవు.

పంచవత్సరాత్మకములగు ద్వాదశ యుగములలో విశ్వేదేవతాకమగు ఈ ఎనిమిదవ యుగములో తృతీయము, ఇదావత్సర సంజ్ఞకము, చంద్రదేవతాకమగు ఈ క్రోధినామ సంవత్సరములో వస్త్రదానము చేసిన మహాపుణ్యమని శాస్త్రములందు కలదు. ఈ సంవత్సరము 6 వీసముల పంట, 2 తూములు వర్షము, 1 తూము వాయువు కలిగి ప్రజలు సర్వసౌఖ్యములు బడయుదురు.

**స్వస్తి సర్వేషాం సన్మఙ్గళాని భవన్తు**
**లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు.**



## శ్రీ మహా గణాధిపతయే నమః  శ్రీమతే హయగ్రీవాయ నమః
## శ్రీ శివాయ గురవే నమః  శ్రీ మహా సరస్వత్యై నమః

స్వస్త్యస్తు. సమస్త కళ్యాణ భాజనస్య శ్రౌతస్మార్త నిత్య నైమిత్తిక కామ్య కర్మానుష్ఠాన శుభక్రియా పరతంత్ర వ్యవహార హేతుభూతస్యాస్య సంవత్సరస్య సృష్ట్యాది గతసౌరాబ్దాః ౧౯౫౫౮౮౫౧౨౫. చతుర్దశసు మనుషు సప్తమే వైవస్వత మన్వంతరే అష్టావింశతితమే మహాయుగే, కృత త్రేతా ద్వాపర యుగేషు గతేషు వర్తమానే అస్మిన్ కలియుగే గతాబ్దాః ౫౧౨౫, తత్ర యుధిష్ఠిర శక ప్రమాణ సౌరాబ్దాః ౩౦౪౪, విక్రమార్క శక ప్రమాణ సౌరాబ్దాః ౧౩౫, వర్తమాన శాలివాహన శక ప్రమాణ సౌరాబ్దాః ౧౮౦౦౦, తత్ర గతాబ్దాః ౧౯౪౬, ఏష్యాబ్దాః ౧౬౦౫౪, తత్ర ప్రభవాది షష్టి వర్షేషు, ద్వాదశ యుగాత్మకేషు, అష్టమే విశ్వేదేవతాకే యుగే, తృతీయస్య ఇదావత్సర సంజ్ఞకస్య, చంద్రదేవతాకస్య 'క్రోధి' నామకస్య అస్య సంవత్సరస్య రాజాది నిర్ణయః.

| | | | | | |
|---|---|---|---|---|---|
| రాజా | - | కుజః | నరాణామధిపతిః | - | శనిః |
| మంత్రీ | - | శనిః | గ్రామాధిపతిః | - | కుజః |
| సేనాపతిః | - | శనిః | వస్త్రాధిపతిః | - | గురుః |
| సస్యాధిపతిః | - | కుజః | రత్నాధిపతిః | - | శనిః |
| ధాన్యాధిపతిః | - | చంద్రః | వృక్షాధిపతిః | - | చంద్రః |
| అర్ఘాధిపతిః | - | శనిః | జఙ్గమాధిపతిః | - | కుజః |
| మేఘాధిపతిః | - | శనిః | సర్పాధిపతిః | - | బుధః |
| రసాధిపతిః | - | గురుః | మృగాధిపతిః | - | శుక్రః |
| నీరసాధిపతిః | - | కుజః | స్త్రీణామధిపతిః | - | శనిః |
| పురోహితః | - | కుజః | కోశాధిపతిః | - | కుజః |
| పరీక్షకః | - | కుజః | రణాధిపతిః | - | శనిః |
| గణకః | - | బుధః | ఛత్రాధిపతిః | - | కుజః |
| గ్రామపాలకః | - | శనిః | ఆజ్ఞాధిపతిః | - | శనిః |
| దైవజ్ఞః | - | శుక్రః | వ్యవహారాధిపతిః | - | శనిః |
| | | | వ్యాపారాధిపతిః | - | శుక్రః |
| అశ్వాధిపతిః | - | శనిః | వర్షాధిపతిః | - | కుజః |
| గజాధిపతిః | - | కుజః | తటాకాధిపతిః | - | శుక్రః |
| పశూనామధిపతిః | - | శనిః | సర్వదేశోద్యోగపతిః | - | శనిః |
| దేవాధీశః | - | కుజః | రాష్ట్రాధిపతిః | - | కుజః |

# మేఘ నిర్ణయము

ఈ సంవత్సరము నవమేఘములలో 'వారుణ' నామక మేఘము. మంచి వర్షములు కురియును. గాలివానలెక్కువ. 2 తూములు వర్షము, 1 తూము వాయువు. ఆఢకము=తూము అనగా 60 యోజనములు వెడల్పు, 100 యోజనములు పొడవు గల దేవమానముచే గణనీయము. 10 భాగములు సముద్రములయందు, 7 భాగములు పర్వతముల మీద, 2 భాగములు భూమియందు వర్షించును. 9 భాగములు సముద్రములయందు, 9 భాగములు పర్వతముల మీద, 2 భాగములు భూమిమీద వర్షించునని పాఠాంతరము కలదు.

# వర్ధంతి శబ్దార్థ విచారము

**"వర్ధంతి"** యను శబ్దము 'వృధు - వృద్ధౌ' అను ధాతువునుండి నిష్పన్నమైనది. అది **'వృద్ధి'** యను అర్థమును చెప్పును. పుట్టినరోజున ఆయురభివృద్ధికి ఆయుష్య హోమాదులనొనరింతురు. కావున 'వర్ధంతి' యను శబ్దము 'పుట్టినరోజుపండుగ' అను అర్థములో ప్రయోగించుటకు యోగ్యముగనున్నది. కాని, ఆంధ్రదేశములో ఈ శబ్దము విపరీతార్థములో వాడబడుచున్నది. కాని అది మిక్కిలియసంగతము. శృంగేరీ జగద్గురు మహాసంస్థానము నందు జగద్గురువుల వారి జన్మదినోత్సవము, మైసూరు సంస్థానము నందు మహారాజుల వారి జన్మదినోత్సవము 'వర్ధంతి' అనియే వందల సంవత్సరముల నుండి వ్యవహరింపబడుచున్నవి. తదనుసారముగా మా యీ పంచాంగమునందును, జగద్గురువుల వారి జన్మదినోత్సవమును 'వర్ధంతి'యనియే నిర్దేశించుచున్నాము. సహృదయులకు 'ఆ పదమునకు విపరీతార్థమును పరిత్యజించి, పైజెప్పిన సరియైనయర్థమును గ్రహింప వవలసినది' అని మా మనవి.



# వర్షధాన్యాదయః

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| వర్షం | – | ౯ | మోహః | – | ౧౯ | ద్రుమకీటకవృద్ధిః | – | ౮ |
| ధాన్యం | – | ౧౧ | మదః | – | ౩ | తన్నాశః | – | ౮ |
| శీతం | – | ౯ | మాత్సర్యం | – | ౧౩ | ఏషాం పరమ | | |
| తృణం | – | ౧౩ | సుఖం | – | ౩ | ఫల భాగాః | – | ౮ |
| ఉష్ణం | – | ౧౨ | దుఃఖం | – | ౨ | క్షుధా | – | ౧ |
| మారుతం | – | ౧౩ | భోగః | – | ౬ | తృష్ణా | – | ౨ |
| ప్రజావృద్ధిః | – | ౧౯ | విడమ్బం | – | ౬ | నిద్రా | – | ౧౩ |
| తన్నాశః | – | ౧౯ | మనోవేదనం | – | ౨ | ఆలస్యం | – | ౧౩ |
| రాజవిద్వరం | – | ౧౧ | ద్వేషః | – | ౩ | ఉద్యోగః | – | ౩ |
| ఉగ్రం | – | ౯ | ప్రతిష్ఠా | – | ౧౯ | శాన్తం | – | ౧౩ |
| పుణ్యం | – | ౯ | అప్రతిష్ఠా | – | ౬ | క్రోధః | – | ౧౧ |
| పాపం | – | ౯ | ద్యూతః | – | ౧౬ | డంబః | – | ౩ |
| ఏషాం పరమ | | | మత్తతా | – | ౧౧ | మిత్రభేదః | – | ౧ |
| ఫల భాగాః | – | ౧౨ | పురుషోత్పత్తిః | – | ౧౬ | ఇష్టతా | – | ౧౩ |
| వ్యాధయః | – | ౧౨ | స్త్రీణాముత్పత్తిః | – | ౬ | రస నిష్పత్తిః | – | ౨ |
| ఉపశమనం | – | ౧౬ | ధాతువాదః | – | ౧౯ | ఫల నిష్పత్తిః | – | ౧౧ |
| ఆచారః | – | ౬ | భయం | – | ౩ | ఏషాం పరమ | | |
| అనాచారః | – | ౬ | శౌర్యం | – | ౨ | ఫల భాగాః | – | ౧౧ |
| జన్మాని | – | ౨ | దుష్ట నిగ్రహః | – | ౧౧ | జ్ఞానం | – | ౬ |
| మరణాని | – | ౨ | శిష్టపాలనం | – | ౧౯ | అజ్ఞానం | – | ౧ |
| దేశోపద్రవః | – | ౧౩ | సత్యం | – | ౧౬ | కాపట్యం | – | ౨ |
| దేశస్వాస్థ్యం | – | ౧౧ | అసత్యం | – | ౯ | నిష్కాపట్యం | – | ౧౩ |
| చోరభయం | – | ౩ | విశ్వాసః | – | ౨ | ధార్మికం | – | ౧౨ |
| తన్నాశః | – | ౬ | అవిశ్వాసః | – | ౬ | అధార్మికం | – | ౧ |
| అగ్నిభయం | – | ౧౯ | దయా | – | ౧౧ | ఏషాం పరమ | | |
| అగ్నిశాంతిః | – | ౯ | నిర్దయా | – | ౧౩ | ఫల భాగాః | – | ౧౨ |
| మృగోపద్రవః | – | ౧౯ | న్యాయః | – | ౧౯ | గోమాయువృద్ధిః | – | ౧౦ |
| మృగక్షయః | – | ౧౩ | అన్యాయః | – | ౧౨ | తన్నాశః | – | ౪ |
| కీటకభయం | – | ౧౨ | ఏషాం పరమ | | | సస్యకీటకవృద్ధిః | – | ౧ |
| తన్నాశః | – | ౧౧ | ఫలభాగాః | – | ౧౬ | తన్నాశః | – | ౧ |
| మూషికవృద్ధిః | – | ౧౩ | సస్యవృద్ధిః | – | ౭ | శలభవృద్ధిః | – | ౧ |
| తన్నాశః | – | ౨ | తన్నాశః | – | ౯ | తన్నాశః | – | ౪ |
| సర్పోపద్రవః | – | ౧౧ | పశువృద్ధిః | – | ౭ | మశకవృద్ధిః | – | ౧౦ |
| తన్నాశః | – | ౬ | తన్నాశః | – | ౨ | తన్నాశః | – | ౧ |
| కామః | – | ౧౬ | శుకవృద్ధిః | – | ౨ | మత్కుణవృద్ధిః | – | ౨ |
| లోభః | – | ౧౯ | తన్నాశః | – | ౨ | తన్నాశః | – | ౪ |

| | | |
|---|---|---|
| వృశ్చికవృద్ధిః | - | ౭ |
| తన్నాశః | - | ౧౦ |
| వ్యాఘ్రవృద్ధిః | - | ౧౦ |
| తన్నాశః | - | ౧౩ |
| ఏషాం పరమ | | |
| ఫల భాగాః | - | ౧౩ |
| పక్షివృద్ధిః | - | ౧ |
| నాశః | - | ౧ |
| ధేనువృద్ధిః | - | ౧ |
| తన్నాశః | - | ౨ |
| మహిషవృద్ధిః | - | ౨ |
| నాశః | - | ౨ |
| మృగవృద్ధిః | - | ౩ |
| తన్నాశః | - | ౧ |
| ఛాగవృద్ధిః | - | ౨ |
| తన్నాశః | - | ౪ |
| అశ్వవృద్ధిః | - | ౧ |
| తన్నాశః | - | ౨ |
| గజవృద్ధిః | - | ౫ |
| తన్నాశః | - | ౧ |
| ఉష్ట్రవృద్ధిః | - | ౨ |
| తన్నాశః | - | ౨ |
| విప్రవృద్ధిః | - | ౩ |
| నాశః | - | ౨ |
| క్షత్రియవృద్ధిః | - | ౫ |
| నాశః | - | ౪ |
| వైశ్యవృద్ధిః | - | ౪ |
| నాశః | - | ౧ |
| శూద్రవృద్ధిః | - | ౫ |
| నాశః | - | ౩ |
| మ్లేచ్ఛవృద్ధిః | - | ౪ |
| నాశః | - | ౪ |
| సఙ్కర వృద్ధిః | - | ౩ |
| నాశః | - | ౧ |
| నవరత్న వృద్ధిః | - | ౩ |
| నాశః | - | ౫ |
| మరకత వృద్ధిః | - | ౧ |
| మాణిక్య వృద్ధిః | - | ౩ |
| వజ్ర వృద్ధిః | - | ౪ |
| వైడూర్య వృద్ధిః | - | ౫ |
| గోమేధిక వృద్ధిః | - | ౧ |
| పుష్యరాగ వృద్ధిః | - | ౧ |

| | | |
|---|---|---|
| ఇన్ద్రనీల వృద్ధిః | - | ౧ |
| ప్రవాళ వృద్ధిః | - | ౧ |
| మౌక్తిక వృద్ధిః | - | ౧ |
| ఇతర రత్న వృద్ధిః | - | ౧ |
| ఏషాం పరమ | | |
| ఫల భాగాః | - | ౫ |
| సువర్ణ వృద్ధిః | - | ౦ |
| రజత వృద్ధిః | - | ౬ |
| తామ్ర వృద్ధిః | - | ౦ |
| కాంస్య వృద్ధిః | - | ౮ |
| లోహ వృద్ధిః | - | ౧౨ |
| అయః | - | ౦ |
| త్రపుః | - | ౧౦ |
| సీసం | - | ౧౦ |
| రస వృద్ధిః | - | ౬ |
| ఏషాం పరమ | | |
| ఫల భాగాః | - | ౧౨ |
| వ్రీహిః | - | ౪ |
| శాలిః | - | ౧౬ |
| కుళుత్థః | - | ౧౨ |
| తిలః | - | ౬ |
| మాషః | - | ౪ |
| ముద్గః | - | ౨ |
| సర్షపః | - | ౧౨ |
| చణకః | - | ౧౪ |
| ఆఢకః | - | ౧౪ |
| గోధూమః | - | ౧౨ |
| కోద్రవః | - | ౪ |
| ప్రియఙ్గుః | - | ౧౦ |
| యవః | - | ౧౨ |
| శ్యామాకః | - | ౬ |
| రాజమాషః | - | ౧౪ |
| నీవారః | - | ౧౬ |
| శిమ్బిః | - | ౧౨ |
| ఏషాం పరమ | | |
| ఫల భాగాః | - | ౧౬ |
| పనస వృద్ధిః | - | ౨౫ |
| నారికేళ వృద్ధిః | - | ౧ |
| మాతులుఙ్గ వృద్ధిః | - | ౧౯ |
| జమ్బీర వృద్ధిః | - | ౧౬ |
| ఖర్జూరఫల వృద్ధిః | - | ౧౦ |
| రమ్భాఫల వృద్ధిః | - | ౧౯ |

| | | |
|---|---|---|
| చూత వృద్ధిః | - | ౭ |
| కపిత్థ వృద్ధిః | - | ౧౯ |
| తిన్త్రిణీ వృద్ధిః | - | ౨౫ |
| ధాత్రీఫల వృద్ధిః | - | ౧ |
| ఏషాం పరమ | | |
| ఫల భాగాః | - | ౨౫ |
| అతి వృష్టిః | - | ౭ |
| అనావృష్టిః | - | ౩ |
| మూషిక వృద్ధిః | - | ౩ |
| శలభ వృద్ధిః | - | ౧౭ |
| శుక వృద్ధిః | - | ౩ |
| స్వచక్రం | - | ౧౩ |
| పరచక్రం | - | ౧౭ |
| ఏషాం పరమ | | |
| ఫల భాగాః | - | ౧౭ |
| స్వప్నః | - | ౦ |
| సుషుప్తిః | - | ౬ |
| జాగ్రత్తా | - | ౦ |
| పైశున్యం | - | ౮ |
| క్రోధః | - | ౧౨ |
| సఙ్గమః | - | ౦ |
| జ్ఞానం | - | ౧౦ |
| అజ్ఞానం | - | ౧౦ |
| భుక్తిః | - | ౬ |
| ధాన్యం | - | ౦ |
| ఏషాం పరమ | | |
| ఫల భాగాః | - | ౧౨ |
| అణ్డజాః | - | ౫ |
| స్వేదజాః | - | ౧౧ |
| ఉద్భిజ్జాః | - | ౫ |
| జరాయుజాః | - | ౧౩ |
| స్థావరాః | - | ౧౭ |
| జఙ్గమాః | - | ౧౭ |
| ఇతర జీవరాశయః | - | ౧౧ |
| ఏషాం పరమ | | |
| ఫల భాగాః | - | ౧౭ |
| విద్యుత్ | - | ౬ |
| శిలాపాతః | - | ౦ |
| గర్జితం | - | ౦ |
| ఉత్సాహః | - | ౯ |

# క్రోధి నామ సంవత్సర ఫలము

క్రోధి సంవత్సరమున ఈతి బాధలు కలిగిననూ. అన్ని పంటలకు వృద్ధి బాగుగనుండును. దంపతులకు, రాజులకు పరస్పర వైరము కలుగును. రోగములు ప్రబలును. క్రోధ లోభ పరాయణులైన రాజులు ప్రజాపీడను కలిగించెదరు. ఈతి బాధలు కలుగును. మధ్యమమయిన పంటలు, వర్షములు, వెలలు కలుగును.

## గురూదయవశమున కార్తికాబ్దము - తత్ఫలము

కార్తికాబ్దమున అగ్నివలన, గోవుల వలన, బండ్ల వలన జీవించు వారికి పీడయగును. శస్త్ర అగ్ని ఆకలి బాధలు, భయములు అధికముగనుండును. పుష్పములమ్మువారు సుఖముగ జీవించుదురు.

## రాజ కుజ ఫలము

కుజుడు రాజయినందున రాజవిరోధమధికమగును. అగ్ని రోగ చోర భయములధికమగును. భూమి సస్య రహితమగును. సర్పభయమధికమగును. రాజులు పరస్పర జయకాంక్షచే యుద్ధము చేయుదురు. కొలది వర్షములుండును. లోకమున భయోత్పాతములధికమగును.

## మంత్రి శని ఫలము

శని మంత్రి అయినందున వర్షములు, పంటలు తక్కువగానుండును. నరులకు పాపకార్యములందాసక్తి పెరుగును. ప్రజలు దుర్మార్గులచే పీడించబడుదురు. అగ్నిభయము, ధాన్యమునకు కొరత, రోగములు కలుగును. అతి తక్కువ వర్షములు కలుగును. సుఖముండదు.

## సేనాపతి శని ఫలము

శని సేనాధిపతియగుటచే రాజులు అధర్మపరులగుదురు. చతురంగ బలములు లేనివారగుదురు. నరులు పాపకృత్యములాచరించుచూ ఎల్లప్పుడు కలహించు వారలగుదురు. నల్లని ధాన్యములు ఫలించును.

## సస్యాధిపతి కుజ ఫలము

కుజుడు సస్యాధిపతి అయినందున అన్నిదేశములయందు సస్యానుకూల వర్షములుండును. శనగలు మొదలగు ధాన్యములు బాగుగ పండును. ఎరుపు వర్ణము గల భూమి ఫలించును.

## ధాన్యాధిపతి చంద్ర ఫలము

చంద్రుడు ధాన్యాధిపతి అయినందున ఆవులు సమృద్ధిగ పాలనిచ్చును. ప్రజలు వ్యాధులు లేక ఆరోగ్యవంతులగుదురు. సుభిక్షము, గొప్పవర్షము కలుగును.

## అర్ఘాధిపతి శని ఫలము

శని అర్ఘాధిపతి అయినందున నూవులు, మినుములు, ఉలవలు మొదలగు నల్లని ధాన్యములు పండును. నల్లని భూమియు చక్కగా పండును.

## మేఘాధిపతి శని ఫలము

శని మేఘాధిపతి అయినందున మధ్యమమగు పంటలు పండును. వెలలు తగ్గుటయు, ఖండవృష్టి కలుగును. నల్లని ధాన్యముల పంటలు పండును.

## రసాధిపతి గురు ఫలము

గురువు రసాధిపతి అయినందున మంచి వర్షములు కలుగును. అన్ని పంటలు, వృక్షములు ఫలించును. ప్రజలందరకీ ఆరోగ్యము, సుభిక్షము కలుగును.

## నీరసాధిపతి కుజ ఫలము

కుజుడు నీరసాధిపతి అయినందున కస్తూరి రాగి రక్తచందనము పగడము బంగారము అగరు కుంకుమ మొదలగు రక్త వస్తువులు సమృద్ధిగ నుండును.

## పురోహిత కుజ ఫలము

కుజుడు పురోహితుడయినందున వెలలు వర్షములు తక్కువగును. రాజులకు యుద్ధము, ప్రజలకు చోరాగ్ని శస్త్ర బాధలు కలుగును.

## పరీక్షక కుజ ఫలము

కుజుడు పరీక్షకుడయినందున ప్రజలకు చోరాగ్ని శస్త్రబాధలు కలుగును. ఎరుపు వర్ణము గల పంటలు బాగుగ పండును. ఎరుపు వర్ణము గల పదార్థములకు సమృద్ధి కలుగును.

## గణక బుధ ఫలము

బుధుడు గణకుడయినందున రాజులు నీతితప్పి ప్రవర్తింతురు. ప్రజలకు అనేక రకములయిన పీడలు కలుగును. వర్షము గాలితో కలిసియుండును.

## గ్రామపాలక శని ఫలము

శని గ్రామపాలకుడయినందున చోరాది దుష్టబాధలచే ప్రజలు మిక్కిలి భయభ్రాంతులగుదురు. నలుపు ధాన్యములు ఫలించును.

## దైవజ్ఞ శుక్ర ఫలము

దైవజ్ఞుడు శుక్రుడు అయినందున విప్రులు నీతికలవారై ధర్మకర్మలను ఆచరించుదురు. పాలకులు ఎల్లప్పుడూ రాజనీతి విచారపరులై మంత్రాంగము చేయుదురు.

## ఇతర నాయక ఫలము

అశ్వాధిపతి మొదలగు ఇతర ఉపనాయకుల విషయములో శుభగ్రహములు అయిన శుభ ఫలితమును, పాపగ్రహములు అయిన అశుభ ఫలితమును గ్రహించవలయును.

## ఆర్ద్రా ప్రవేశకాల రవిఫలము

ఈ సంవత్సరము జ్యేష్ఠ పూర్ణిమ తత్కాల కృష్ణ ప్రతిపత్ శనివారము, మూలా నక్షత్రము, శుక్లయోగము, బాలవ కరణము, కర్కటకలగ్నము, స్త్రీ-నపుంసక నక్షత్ర సంయోగమున ఉదయాది ఘ॥౭.౧౧వి॥ భోగసమయమున సూర్యుడు ఆర్ద్రా నక్షత్రమున ప్రవేశించును.

ఈ సంవత్సరము రవి ఆర్ద్రా ప్రవేశము పగలు మరియు శనివారము కలుగుట వర్షనాశనమును, తక్కువ ఫలితములను సూచించుచున్నది. భరణ్యాది షణ్మండలగత చంద్రఫలము వర్షనాశనమును సూచించుచున్నందున ఆంధ్రదేశమునకు కొన్ని ఈతిబాధలు తప్పకపోవచ్చును. అయితే, తిథి నక్షత్ర యోగ కరణ లగ్న ఫలములు శుభము, సుభిక్షము, పంటలు, వర్షములను సూచించుచున్నందున మొత్తము మీద శుభ ఫలితమే అధికముగ చెప్పవలయును.

## మేష సంక్రాంతి ఫలము

ఈ సంవత్సరము చైత్ర శుక్ల పంచమీ తత్కాల షష్ఠి శనివారము, మృగశిరా నక్షత్రమున ఉదయాది ఘ॥౪౩.౨౬వి॥ భోగసమయమున సూర్యుడు మేషరాశియందు ప్రవేశించును.

ఈ సంవత్సరము మేష సంక్రమణము శనివారము మరియు షష్ఠీ తిథి అగుటచే వర్షములు తక్కువ. అయిననూ రాత్రిపూట కనుక పంటలవృద్ధి, క్షేమము, ఆరోగ్యము, సుభిక్షము కలుగును.

## గురుచార ఫలము

ఈ సంవత్సరము గురువు, చైత్ర కృష్ణ దశమి వరకు మేషరాశి యందుండును. అటు పిమ్మట వృషభరాశిలోనికి ప్రవేశించును.

## మేషరాశి స్థిత గురుఫలము

గురువు మేషమందున్నప్పుడు మేకలు నాశనము పొందును. పంటలు, ధరలు, ప్రజల ఆరోగ్యం వృద్ధిగనుండును. వర్షము రైతులకు అనుకూలముగ నుండును. రాజకలహములు సంభవించును. ఈతిబాధలు కొంతమేరకు ఉండును. కానీ చివరకు ప్రజలు సుఖింతురు.

## వృషభరాశి స్థిత గురుఫలము

గురువు వృషభమందున్నప్పుడు పశువులకు, స్త్రీలకు, శిశువులకు హాని జరుగును. మధ్యమమయిన వర్షము, పైరులకు హాని కలుగును. రాజులకు యుద్ధము కలుగును.

## కుంభరాశి స్థిత శనిఫలము

శని కుంభమందుండుటచే వర్షము తక్కువగాయుండును. రాజులకు భయము కలుగును. ప్రజలయొక్క పంటలు నశించును. వైద్యులకు, కవులకు, ధనాధిపతులకు అతిభయము కలుగును.

## శని నక్షత్రఫలము

ఈ సంవత్సరము శని, చైత్ర శుక్ల సప్తమి నుండి భాద్రపద శుక్ల దశమి వరకు పూర్వాభాద్రా యందు, అటు పిమ్మట పుష్య పూర్ణిమ వరకు శతతార యందు, అటు పిమ్మట తిరిగి పూర్వాభాద్రాయందుండును. శతతారయందుండు శని వైద్యులకు, కవులకు, రాజులకు, మంత్రులకు హాని కలుగజేయును. పూర్వాభాద్రాయందుండు శని పాండ్యదేశమునకు, నీతిమంతులకు హాని కలుగజేయును.

## కూర్మచక్రస్థిత శని ఫలము

ఈ సంవత్సరము శని, శతతారా, పూర్వాభాద్రా నక్షత్రములందు సంచరించును. కావున నేపాలము, ఉత్కళము, కాశ్మీరము, గుజరాత్, మధుర, బదరీ, కేదారము మొదలగు ప్రాంతములకు హాని జరుగును. కావున ఆ ప్రాంత పాలకులు జాగరూకతతో ప్రజారక్షణ, దేశరక్షణ చేయవలయును.

## జ్యేష్ఠ శుక్ల ప్రతిపద్యుక్త వారఫలము

జ్యేష్ఠ శుక్ల పాడ్యమి శుక్రవారము అయినందున ప్రజలకు సుభిక్షము, ఆరోగ్యము, సుఖము కలుగును. మంచి వర్షముల వలన అన్ని దేశములయందు పంటలు వృద్ధి పొందును.

## ఆషాఢ శుక్ల పంచమీయుక్త వారఫలము

ఆషాఢ శుక్ల పంచమి గురువారము అయినందున దేశమంతటయూ సుభిక్షము కలుగును. పశువులకు మేత సమృద్ధిగనుండును.

## ఆషాఢ శుక్లపక్ష స్వాతీ యుక్త తిథిఫలము

ఆషాఢ శుక్లపక్షమునందు స్వాతీ నక్షత్రము నవమి తిథితో కలిసి యున్నందున అధికమయిన గాలియుండును. భూమియందు విత్తనములు చల్లుటకు అవకాశముండదు.

## ఆషాఢ కృష్ణపక్ష రోహిణీ యుక్త తిథిఫలము

ఆషాఢ కృష్ణపక్షమందు రోహిణి నక్షత్రము ఏకాదశి తిథితో కలిసి యున్నందున మంచివర్షములు కురియును. అన్నిపంటలు సమృద్ధిగ పండును.

## పుష్యబహుళ అమాయుక్త వారఫలము

పుష్యమాస అమావాస్య బుధవారము అయినందున జనులకు వృద్ధి కలుగును.

## పశునాయక యమ ఫలము

ఈ సంవత్సరము పశునాయకుడు యముడయినందున వెలలు తక్కువ. వర్షము తక్కువ. ఆవులు తక్కువ పాలనిచ్చును. పశువులకు నిత్యము పీడ కలుగును.

## గోష్ఠాగారప్రాపక గోష్ఠాద్బహిఃప్రాపక బలరామ ఫలము

ఈ సంవత్సరము గోష్ఠాగార ప్రాపకుడు, గోష్ఠాద్బహిష్కర్త ఇరువురూ బలరాముడయినందున పాడిపంటలు సమృద్ధిగనుండును. పశువుల క్షేమము మధ్యమము. మంచి వర్షము, పంటలు, సుభిక్షం అచటచట కలుగును.

## విశేష ఫలాములు

ఈ సంవత్సరము వివహనామక వాయువు వలన వర్షనాశనము, అచలనామక విద్యుత్ (మెరుపు) వలన మంచి వర్షము, నీచ నామక గర్జితము (ఉరుము) వలన అనావృష్టి, క్షారనామక సముద్రము వలన గాలితో కూడిన వర్షములు, మంచి వర్షములు కలుగును.

## భూవాహక పద్మక ఫలము

భూవాహకుడు పద్మకుడు అయినందున జనులకు సుఖము, ఆరోగ్యము, భోగభాగ్యములు, పాడిపంటలు సమృద్ధిగనుండును.

## రాజవాహన నౌకా ఫలము

ఈ సంవత్సరము రాజుయొక్క వాహనం నౌక కావున ప్రజాకల్లోలములు, పశునష్టము, పంటలు పండకపోవుట (దుర్భిక్షము) అధికముగనుండును.

## ఆఢకధారకఫలము

ఈ సంవత్సరము ఆఢకము వేశ్యాహస్తగతమగుటచే వెలలు, వర్షము చక్కగా ఉండును. చైత్ర శుక్ల సప్తమి వరకు యువ వేశ్యాహస్తగతమగుటచే మంచి వర్షములు, అటుపిమ్మట భాద్రపద శుక్ల దశమి వరకు వృద్ధవేశ్యా హస్తగతమగుటచే సుభిక్షము, అటుపిమ్మట పుష్య పూర్ణిమ వరకు యువవేశ్యా హస్తగతమగుటచే మంచి వర్షములు తిరిగి వృద్ధ వేశ్యా హస్తగతమగుటచే సుభిక్షము కలుగును.

## సముద్రచక్రమున రోహిణీ నివాస ఫలము

ఈ సంవత్సరము రోహిణీ వాసము సముద్రమందు కావున అధిక వర్షములుండును. సమస్త సస్యములు చక్కగా ఫలించును. పాడిపంటల సమృద్ధి యుండును.

## సంవత్సరాధిపతి వాస ఫలము

సంవత్సరాధిపతి వాసము మాలాకారుని గృహమందు కావున అన్ని వస్తువుల ధరలు మధ్యమమగనుండును.

## చతుస్స్తంభ ఫలము

ఈ సంవత్సరము చైత్ర జ్యేష్ఠ ఆషాఢ శుక్ల పాడ్యమిల యందు వరుసగా రేవతీ మృగశిరా పునర్వసు నక్షత్రములున్నందున, నీరు, అనుకూలమయిన వాయువు, ధాన్యము ఎక్కువగా కలుగును. ౩/౪ శుభము.

ఈ సంవత్సరము ౬ వీసముల పంట, ౨ తూములు వర్షం, ఒక తూము వాయువు కలుగును.

## మౌఢ్య నిర్ణయము

1) చైత్ర కృష్ణ తదియ శనివారము (27-4-2024) నుండి ఆషాఢ శుక్ల చవితి మంగళవారము (10-7-2024) వరకు ప్రాగస్తమిత శుక్ర మౌఢ్యము.

2) చైత్ర కృష్ణ ఏకాదశి శనివారము (4-5-2024) నుండి వైశాఖ కృష్ణ చతుర్దశి బుధవారము (5-6-2024) వరకు పశ్చాదస్తమిత గురు మౌఢ్యము.

3) ఫాల్గున కృష్ణ చవితి మంగళవారము (18-3-2025) నుండి ఫాల్గున కృష్ణ త్రయోదశి గురువారము (27-3-2025) వరకు పశ్చాదస్తమిత శుక్ర మౌఢ్యము.

## కర్తరీ నిర్ణయము

చైత్ర కృష్ణ ఏకాదశి శనివారము (4-5-2024) నుండి వైశాఖ కృష్ణ పంచమి మంగళవారము (28-5-2024) వరకు వాస్తుకర్తరి.

## పుష్కర నిర్ణయము

చైత్ర కృష్ణ దశమి శుక్రవారము (3-5-2025) నుండి 'రేవా (నర్మదా)' నది పుష్కరములు.

## గ్రహణ నిర్ణయము

ఈ సంవత్సరము మన ప్రాంతములో కనిపించు గ్రహణములు లేవు.

## ఆదాయ వ్యయ నిర్ణయము

| రాశులు | ఆదాయము | వ్యయము | రాశులు | ఆదాయము | వ్యయము |
|---|---|---|---|---|---|
| మేష వృశ్చికములు | ౮ | ౧౪ | సింహము | ౨ | ౧౪ |
| వృషభ తులలు | ౨ | ౮ | ధనుర్మీనములు | ౧౧ | ౫ |
| మిథున కన్యలు | ౫ | ౫ | మకర కుంభములు | ౧౪ | ౧౪ |
| కర్కటకము | ౧౪ | ౨ | అన్నిరాశులకు | ౫౬ | ౬౨ |

రాబడి ఖర్చులతో పాటు, రోగము ఆరోగ్యము, పుణ్యము పాపము, లాభము నష్టము, గెలుపు ఓటమి, సుఖము దుఃఖము, పెరుగుదల తగ్గుదలలు కూడా ఆదాయ వ్యయములుగనే పేర్కొనబడుచున్నవి. ఆదాయ వ్యయ సంఖ్యలను కలిపి దానిలో ౧ తీసివేసి మిగిలిన సంఖ్యను ౮చే భాగించగా, శేష సంఖ్య ౧ లాభమును, ౨ సౌఖ్యమును, ౩ కష్టమును, ౪ రోగమును, ౫ అపవాదును, ౬ సన్మానమును, ౭ విజయమును, ౦ హానిని తెలియజేయును.

## కందాయ ఫలనిర్ణయము

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | ౪ | ౦ | ౦ | మఘ | ౭ | ౦ | ౨ | మూల | ౨ | ౦ | ౪ |
| భరణి | ౭ | ౧ | ౩ | పూర్వఫల్గుని | ౨ | ౧ | ౦ | పూర్వాషాఢ | ౫ | ౧ | ౨ |
| కృత్తిక | ౨ | ౨ | ౧ | ఉత్తరఫల్గుని | ౫ | ౨ | ౩ | ఉత్తరాషాఢ | ౦ | ౨ | ౦ |
| రోహిణి | ౫ | ౦ | ౪ | హస్త | ౦ | ౦ | ౧ | శ్రవణ | ౩ | ౦ | ౩ |
| మృగశిర | ౦ | ౧ | ౨ | చిత్ర | ౩ | ౧ | ౪ | ధనిష్ఠ | ౬ | ౧ | ౧ |
| ఆర్ద్ర | ౩ | ౨ | ౦ | స్వాతి | ౬ | ౨ | ౨ | శతతార | ౧ | ౨ | ౪ |
| పునర్వసు | ౬ | ౦ | ౩ | విశాఖ | ౧ | ౦ | ౦ | పూర్వాభాద్ర | ౪ | ౦ | ౨ |
| పుష్యమి | ౧ | ౧ | ౧ | అనూరాధ | ౪ | ౧ | ౩ | ఉత్తరాభాద్ర | ౭ | ౧ | ౦ |
| ఆశ్లేష | ౪ | ౨ | ౪ | జ్యేష్ఠ | ౭ | ౨ | ౧ | రేవతి | ౨ | ౨ | ౩ |

మొదటి ౦ తీవ్రమగు అనారోగ్యమును, మధ్య ౦ మిక్కిలి భయమును, చివరి ౦ అత్యల్ప ఫలప్రాప్తిని, మూడు చోట్ల ౦ ఉండుట ఫలరాహిత్యము (సమస్త కార్యహాని) ను తెలియజేయును. బేసి సంఖ్య ధనలాభమును, సరి సంఖ్య మధ్యమ ఫలమును, శూన్య సంఖ్య ఫలరాహిత్యమును తెలియజేయును.

## రాజపూజ్యావమాన నిర్ణయము

| రాశి | పూజ్యత | అవమానము | రాశి | పూజ్యత | అవమానము |
|---|---|---|---|---|---|
| మేషము | ౪ | ౩ | తుల | ౧ | ౫ |
| వృషభము | ౨ | ౩ | వృశ్చికము | ౫ | ౫ |
| మిథునము | ౩ | ౬ | ధనుస్సు | ౨ | ౫ |
| కర్కటకము | ౬ | ౬ | మకరము | ౩ | ౧ |
| సింహము | ౭ | ౭ | కుంభము | ౬ | ౧ |
| కన్య | ౫ | ౭ | మీనము | ౭ | ౪ |

## అశ్విన్యాది నక్షత్రములకు సంవత్సర ఫలము

అశ్విని పుష్యమి స్వాతి అభిజిత్ వారికి యుద్ధము,
భరణి ఆశ్లేష విశాఖ శ్రవణ వారికి భూషణము,
కృత్తిక మఘ అనూరాధ ధనిష్ఠ వారికి రోగము,
రోహిణి పూర్వఫల్గుని జ్యేష్ఠ శతతార వారికి ఆరోగ్యము,
మృగశిర ఉత్తరఫల్గుని మూల పూర్వాభాద్ర వారికి అర్థలాభము,
ఆర్ద్ర హస్త పూర్వాషాఢ ఉత్తరాభాద్ర వారికి మనస్తాపము,
పునర్వసు చిత్రా ఉత్తరాషాఢ రేవతి వారికి రాజమాన్యము.

## చాంద్రార్ఘములు

ఈ సంవత్సరము ధరలు, చైత్ర ఆశ్వయుజ మాసములందు స్వల్పముగను, వైశాఖ భాద్రపద పుష్య ఫాల్గునముల మాసములయందు అధికముగను, జ్యేష్ఠ ఆషాఢ శ్రావణ కార్తిక మార్గశిర మాఘ మాసములయందు సమముగను ఉండును.

## సౌరార్ఘములు

ఈ సంవత్సరము ధరలు, మేష కర్కటక ధనుస్సు మకర కుంభ మాసములయందు తక్కువగను, వృషభ కన్య తుల మీన మాసములయందు అధికముగను, మిథున సింహ వృశ్చిక మసములయందు సమముగను ఉండును.

## కుజ వక్ర ఫలము

కుజునకు ౧౬వ నక్షత్రమందు ఉదయ వక్రతలు కలుగుటను రుధిరాననమందురు. అది మనుషులకు సుభిక్షమును, వ్యాధిభయమును కలిగించును.

## మాస ఫలము

ఒక మాసములో ౫ మార్లు సంభవించు ఆదివారము రోగములను, మంగళవారము మిక్కిలి భయమును, శనివారము కరువును, మిగిలిన వారములు శుభమును కలిగించును.

# మకర సంక్రాంతి నిర్ణయము

ఈ సంవత్సరము **పుష్య కృష్ణ పాడ్యమి** మంగళవారము, పుష్యమి నక్షత్రము, విష్కంభ యోగము, బాలవకరణము, వృషభలగ్నము, ఘ॥౨౦.౦౦వి॥ భోగసమయమున సూర్యుడు మకరరాశియందు ప్రవేశించును.

## సంక్రాంతి పురుష లక్షణము



సంక్రాంతి పురుషుని యొక్క రూపము మూడు శిరస్సులు, రెండు ముఖములు, నాలుగు నోరులు, మూడు కన్నులు, వేలాడు చెవులు, ఎర్రని దంతములు. క్రిందకు జారిన కనుబొమలు, పొడవగు ముక్కు, ఎనిమిది బాహువులు, రెండు పాదములు, నల్లని శరీర ఛాయతో వికృతముగా ఉండి నూరు యోజనముల ఎత్తు, పండ్రెండు యోజనముల వెడల్పు కలిగి యుండును.

ఈ సంక్రాంతి పురుషుడు 'మహోదర' నామకుడగుట చోరులకు శుభమును, బిల్వోదకముతో స్నానము చేయుట మహాభయమును, ఎరుపు రంగు వస్త్రమును ధరించుట రోగభయమును, చందన గంధమును విలేపనము చేసికొనుట బ్రాహ్మణులకు హానిని, జాజీ పుష్పములను ధరించుట మంగళమును, ముత్యముల హారమును ధరించుట శుభమును, వెండి పాత్రను ధరించుట సుభిక్షమును, పాయసాహారమును భక్షించుట పశువులకు హానిని, అరటి పండును భక్షించుట ఫలనాశనమును, 'భిందిపాలము' అను ఆయుధమును ధరించుట వ్యాధిభయమును, ఎరుపురంగు గొడుగును ధరించుట తీవ్రయుద్ధమును, పులిని వాహనముగా స్వీకరించుట అడవిజంతువులకు హానిని, ముఖములో కోపము వ్యక్తమగుట జననాశనమును, కూర్చునియుండుట ధాన్యములు, వెలలు మరియు వర్షములు మధ్యమముగా ఉండుటను కలిగించును.

సంక్రాంతి పురుషుడు దక్షిణ దిక్కుకు పయనించుట ఆదిక్కున గల దేశములలో కరవు మరియు ఉపద్రవములను, సంక్రమణ సమయమున ఉన్న పష్య కృష్ణపక్షము సుభిక్ష క్షేమ ఆరోగ్య సస్య సంపదలను, ప్రతిపత్తిథి కరవును, మంగళవారము వ్యాధులు కరవు రోగభయమును, అపరాహ్ణ కాలము శూద్రనాశనమును, వృషభలగ్నము సుఖదుఃఖ లోలతను, సుముహూర్త ఫలము శుభమును కలిగించును.

సంక్రాంతి పురుషుడు ధరించిన వర్ణద్రవ్యము వృద్ధిప్రదము కాదు కావున ప్రయత్నపూర్వకముగా దానిని ఉపయోగించరాదు.

| | | | |
|---|---|---|---|
| చంద్రః రవిః శుక్రః రాహుః | బుధః గురుః | | |
| కుజః శనిః | వర్షలగ్నమ్ | | |
| | | | |
| లగ్నమ్ | | | కేతుః |

| | | | |
|---|---|---|---|
| బుధః శుక్రః రాహుః | రవిః గురుః | | చంద్రః |
| కుజః శనిః | జగల్లగ్నమ్ | | |
| | | | |
| లగ్నమ్ | | | కేతుః |

ఈ సంవత్సరము వర్షలగ్నము ధనుస్సు. లగ్నాధిపతికి కోణమందు మిత్రక్షేత్ర స్థితి మరియు లగ్నాధిపతి లగ్నమును వీక్షించుట చాలా మంచిది. దేశము సుభిక్షముగనుండగలదు. మరియు అన్ని రంగములలో వృద్ధి పొందగలదు. చతుర్థ, దశమ స్థానములందు పాపగ్రహములుండుట పాపగ్రహా వీక్షణ వలన కొన్ని అలజడులు, ఈతిబాధలతో పాటు కొన్ని సందర్భములలో విదేశీ చర్యల వలన కొన్ని ఇబ్బందులు రావచ్చును. అయితే చతుర్థమున చంద్రుని మిత్రక్షేత్ర స్థితి, శుక్రుని ఉచ్ఛస్థితి వలన తృతీయమున పాపగ్రహస్థితి వలన అంతయూ సవ్యముగ జరుగును. వ్యవసాయరంగం మధ్యస్థముగనున్ననూ ధాన్యాదులకు కొరత లేకుండును.

ఈ సంవత్సరము జగల్లగ్నము ధనుస్సు. జగల్లగ్నమును లగ్నాధిపతితో పాటు శుభగ్రహములు వీక్షించుటచే దేశము సుభిక్షముగనుండగలదు. 'యదా శుభగ్రహైర్దృష్టం లగ్నం స్యాత్తు తదా శుభం' అని అనినందున దేశమున ప్రజలందరకు క్షేమము, శుభము కలుగును. పాడి పంటలకు ఇబ్బంది లేదు. దేశ సంపద పెరుగును. ఇరుగుపొరుగు దేశములలో దేశ ప్రతిష్ఠ పెరుగును. ఉత్తరమున, తూర్పున ప్రజలకు సుఖము కలుగును. మధ్యదేశమున దుర్భిక్షము, అతివర్షము, రోగాధిక్యత కలుగును. పశ్చిమ దిక్కునందు ధాన్యమునకు ధరలు పెరుగును. దక్షిణ దిక్కున జనులకు సుఖము కలిగిననూ, పశుపీడయూ కలుగును. ఈ సంవత్సరము జ్యేష్ఠ, పుష్యమాసములందు క్లిష్ట పరిస్థితులు ఏర్పడగలవు. ఆషాఢ, శ్రావణములయందు మిశ్రమ ఫలితములు కలుగును. ఆశ్వయుజము ఉత్తమముగనుండగా మిగిలిన వైశాఖ, భాద్రపద, కార్తిక, మార్గశిర, మాఘ, ఫాల్గునములు యథోచితముగనుండును.



## రవి నక్షత్ర ప్రవేశకాల సూచిక

| ఆంగ్ల తేది | మాస తిథి వారము | నక్షత్రము | ఘ.విఘ | స్త్రీ.పు.న | లగ్నము | జలరాశులు | వాహనము |
|---|---|---|---|---|---|---|---|
| 13-04-24 | చైత్ర శుక్ల ౫/౬ శని | అశ్విని | ౪౩.౨౬ | పు.నపు | ధనుస్సు | అర్ధజల | మయూరము |
| 27-04-24 | చైత్ర కృష్ణ ౩/౪ శని | భరణి | ౨౪.౪౦ | స్త్రీ.స్త్రీ | కన్య | నిర్జల | అశ్వము |
| 11-05-24 | వైశాఖ శుక్ల ౪ శని | కృత్తిక | ౧౨.౨ | పు.నపు | కర్కటకం | పూర్ణజల | మండూకము |
| 25-05-24 | వైశాఖ కృష్ణ ౨ శని | రోహిణి | ౫.౫౪ | పు.స్త్రీ | మిథునం | నిర్జల | గార్దభము |
| 08-06-24 | జ్యేష్ఠ శుక్ల ౨ శని | మృగశిర | ౫.౨ | నపు.స్త్రీ | మిథునం | నిర్జల | జంబుకము |
| 22-06-24 | జ్యేష్ఠ శుక్ల ౧౫/కృష్ణ ౧ శని | ఆర్ద్ర | ౭.౧౧ | స్త్రీ.నపు | కర్కటకం | పూర్ణజల | మయూరము |
| 06-07-24 | ఆషాఢ శుక్ల ౧ శని | పునర్వసు | ౧౧.౧౯ | పు.పు | సింహం | నిర్జల | అఖువు |
| 20-07-24 | ఆషాఢ శుక్ల ౧౪ శని | పుష్యమి | ౧౪.౪౫ | పు.స్త్రీ | కన్య | నిర్జల | మేషము |
| 03-08-24 | ఆషాఢ కృష్ణ ౧౪ శని | ఆశ్లేష | ౧౫.౪౪ | స్త్రీ.పు | తుల | పాదజల | అశ్వము |
| 17-08-24 | శ్రావణ శుక్ల ౧౩ శని | మఘ | ౧౨.౧౭ | స్త్రీ.స్త్రీ | తుల | పాదజల | మండూకము |
| 31-08-24 | శ్రావణ కృష్ణ ౧౩ శని | పూర్వఫల్గుని | ౩.౬ | స్త్రీ.పు | కన్య | నిర్జల | మహిషము |
| 13-09-24 | భాద్రపద శుక్ల ౧౦/౧౧ శుక్ర | ఉత్తరఫల్గుని | ౪౭.౩౯ | స్త్రీ.స్త్రీ | మిథునం | నిర్జల | అఖువు |
| 27-09-24 | భాద్రపద కృష్ణ ౧౦/౧౧ శుక్ర | హస్త | ౨౫.౨౪ | పు.పు | కుంభం | అర్ధజల | మయూరము |
| 10-10-24 | ఆశ్వయుజ శుక్ల ౭/౮ గురు | చిత్ర | ౫౫.౫౫ | స్త్రీ.స్త్రీ | సింహం | నిర్జల | అశ్వము |
| 24-10-24 | ఆశ్వయుజ కృష్ణ ౮ గురు | స్వాతి | ౧౯.౩౪ | స్త్రీ.పు | మకరం | పూర్ణజల | మండూకము |
| 06-11-24 | కార్తిక శుక్ల ౫/౬ బుధ | విశాఖ | ౩౭.౨౪ | స్త్రీ.స్త్రీ | మిథునం | నిర్జల | మయూరము |
| 19-11-24 | కార్తిక కృష్ణ ౪/౫ మంగళ | అనూరాధ | ౪౯.౧౨ | పు.పు | కన్య | నిర్జల | గజము |
| 02-12-24 | మార్గశిర శుక్ల ౧/౨ సోమ | జ్యేష్ఠ | ౫౬.౪౦ | పు.స్త్రీ | తుల | పాదజల | జంబుకము |

| ఆంగ్ల తేది | మాస తిథి వారము | నక్షత్రము | ఘ.విఘ | స్త్రీ.పు.న | లగ్నము | జలరాశులు | వాహనము |
|---|---|---|---|---|---|---|---|
| 16-12-24 | మార్గశిర కృష్ణ ౧ సోమ | మూల | ౦.౪౬ | నపు.స్త్రీ | ధనుస్సు | అర్ధజల | గార్ధభము |
| 29-12-24 | మార్గశిర కృష్ణ ౧౪ ఆది | పూర్వాషాఢ | ౨.౫౬ | స్త్రీ.స్త్రీ | ధనుస్సు | అర్ధజల | అశ్వము |
| 11-01-25 | పుష్య శుక్ల ౧౨/౧౩ శని | ఉత్తరాషాఢ | ౪.౩౩ | స్త్రీ.పు | మకరం | పూర్ణజల | జంబుకము |
| 24-01-25 | పుష్య కృష్ణ ౧౦ శుక్ర | శ్రవణ | ౭.౨౭ | పు.పు | కుంభము | అర్ధజల | మయూరము |
| 06-02-25 | మాఘ శుక్ల ౯ గురు | ధనిష్ఠ | ౧౩.౭ | స్త్రీ.పు | మేషము | పాదజల | అశ్వము |
| 19-02-25 | మాఘ కృష్ణ ౭ బుధ | శతతార | ౨౨.౪౭ | నపు.స్త్రీ | కర్కటకం | పూర్ణజల | జంబుకము |
| 04-03-25 | ఫాల్గున శుక్ల ౫/౬ మంగళ | పూర్వాభాద్ర | ౩౭.౨౯ | పు.స్త్రీ | తుల | పాదజల | మయూరము |
| 17-03-25 | ఫాల్గున కృష్ణ ౩/౪ సోమ | ఉత్తరాభాద్ర | ౫౭.౫౯ | పు.స్త్రీ | కుంభము | అర్ధజల | అశ్వము |

స్త్రీ స్త్రీ నక్షత్రములయిన వ్యసనం కలిగించును. స్త్రీ పురుష నక్షత్రములయిన వర్షము. స్త్రీ నపుంసకములయిన వాయువు. పురుష పురుష నక్షత్రములయిన ఎండ. ఆఖువు (ఎలుక) స్వల్పవర్షం. మయూరం (నెమలి) మహావాయువు. జంబుకం (నక్క) మేఘావృతం, మండూకం (కప్ప) మిక్కిలివర్షం. ఖర (గార్ధభ - గాడిద), మహిషం (దున్నపోతు) జల రహితం. అజ (మేష- మేక) నిర్జలం. గజ (ఏనుగు) అశ్వం(గుఱ్ఱం) సుభిక్షం. కార్తె ప్రవేశకాల ఘటికలలో తత్కాల తిథి, వార, నక్షత్ర సంఖ్యలను కలిపి అందు 15 కలిపి 6 చే గుణించి 8చే భాగించగా శేషము 1,2,5,6,8 అయిన

# వర్షయోగవిచారః

**చైత్రము :** ఈ మాసమున, రవి వాయు మహావాయు నాడులయందు, బుధుడు దహన నాడియందు, శుక్రుడు సౌమ్య దహన వాయు మహావాయు నాడులయందు సంచరించుటచే ఉష్ణతీవ్రత, వాతాధిక్యముగనుండును. మాసమధ్యప్రాంతమున బుధ శుక్ర సమీపస్థితి, కుజచలనం మొదలగు హేతువులచే మాసాంతమున గుర్వస్తమయము వలన ఒకటి రెండు చోట్ల తప్పక వర్షించును.

**వైశాఖము :** ఈ మాసమున రవి బుధ శుక్రులు, మహావాయు వాయు నాడులయందు సంచరించుటచే గ్రీష్మాధిక్యము, వాతాధిక్యము అధికముగా కలుగును. కుజుడు దహన నాడియందు సంచరించుటచే కూడా వర్షమునకు అవకాశము తక్కువ. మాసాంతమున ఒకటి రెండు చోట్ల వడగండ్లవాన కలుగును.

**జ్యేష్ఠము :** ఈ మాసమున కుజుడు, వాయు మహావాయు నాడులయందు సంచరించును. రవి దహన నాడియందు సంచరించుటచే పూర్వార్ధమున గ్రీష్మాధిక్యము, వాతాధిక్యముగనుండును. ఉత్తరార్ధమున రవి సౌమ్యనాడియందు సంచరించును కావున కొంత చల్లబడును. బుధ శుక్రులు పూర్వార్ధమున వాయు దహన నాడులయందు సంచరించినను ఉత్తరార్ధమున సౌమ్య రస జలనాడుల యందు సంచరించుటచే తొలకరి వర్షము ఉత్తరార్ధమున కలుగును. మాసాంతమున బుధ శుక్రులు ఇరువురూ స్వనాడీసంచారము చేయును కనుక బీజవాపానుకూల సువృష్టి అన్ని ప్రాంతములయందు కలుగును.

**ఆషాఢము :** ఈ మాసమున రవి, రస జలనాడులయందు సంచరించుటచే వాతావరణము చల్లబడును. కుజుడు మహావాయు, వాయు నాడులయందు సంచరించుటచే కొంత పొడిగాలి వాతావరణము ఉండును. మాస ప్రారంభమున బుధుని స్వనాడీ సంచారము, శుక్రోదయము, కుజచలనము మొదలగు హేతువులచే సస్యానుకూలమముగ తప్పక వర్షించును. మాసాంతమున బుధ శుక్ర సమీప స్థితిచే తప్పక వర్షించును.

**శ్రావణము :** ఈ మాసమున రవి, అమృత జలనాడులయందు సంచరించును. మాస ప్రారంభమున బుధ శుక్ర సమీప స్థితిచే తప్పక వర్షించును. బుధ శుక్రులు, అమృత జలనాడులయందు సంచరించుటచే కొన్ని తావుల వర్షించిననూ మధ్యప్రాంతము నుండి కుజుని స్వనాడీ సంచారము వర్షప్రతిబంధకము. మాసాంతమున శుక్రుని స్వనాడీ సంచారముచే కొన్ని ప్రాంతములయందు సాధారణము కన్నా తక్కువ వర్షము కలుగును.

**భాద్రపదము :** ఈ మాసమున రవి, జల రస సౌమ్యనాడుల యందు, కుజుడు సౌమ్యనాడియందు, బుధుడు అమృత జల రస నాడుల యందు, శుక్రుడు సౌమ్య దహన వాయు నాడులయందు సంచరించుటచే మాస ప్రారంభమున సాధారణ వర్షము, మధ్యప్రాంతమున బుధుని స్వనాడీ సంచారముచే అధిక వర్షము, మాసాంతమున స్వల్ప వర్షము కురియును.

**ఆశ్వయుజము :** ఈ మాసమున రవి, సౌమ్య దహన వాయు నాడుల యందు, బుధుడు దహన వాయు మహావాయు నాడులయందు, కుజుడు రస జల నాడులయందు సంచరించుట వలన, మాస మధ్యప్రాంతమున కుజచలనం వలన వాయు సహిత వృష్టి కలుగును.

| లగ్నము | ప్రమాణము | పుష్కరము | లగ్నము | ప్రమాణము | పుష్కరము |
|---|---|---|---|---|---|
| మేషం | ౪.౨ | ౨.౪౮ | తుల | ౫.౧౪ | ౪.౧౧ |
| వృషభం | ౪.౩౦ | ౨.౬ | వృశ్చికం | ౫.౨౭ | ౧.౧౬ |
| మిధునం | ౫.౧౧ | ౪.౮ | ధనుస్సు | ౫.౩౫ | ౩.౫౪ |
| కర్కటకం | ౫.౩౫ | ౧.౧౭ | మకరం | ౫.౧౧ | ౨.౨౫ |
| సింహం | ౫.౨౭ | ౩.౪౬ | కుంభం | ౪.౩౦ | ౩.౩౬ |
| కన్య | ౫.౧౪ | ౨.౫౬ | మీనం | ౪.౨ | ౦.౫౬ |

# దీపావళి నిర్ణయము

ఆశ్వయుజ కృష్ణ త్రయోదశీ బుధవారము ౧౫.౨౪, చతుర్దశీ గురువారము ౨౦.౪౪, అమావాస్యా శుక్రవారము ౨౫.౫౧, స్వాతి ౫౧.౪౪,

**త్రయోదశీ బుధవారము తెల్లవారుజామున నరకచతుర్దశీ ప్రయుక్త స్నానాదికములను ఆచరించవలెను.**

**శుక్రవారము దీపావళి.**

శ్లో॥ ఇషాసిత చతుర్దశ్యాం ఇన్దుక్షయదినేఽపి వా ।
ఊర్జాదౌ స్వాతి సంయుక్తౌ తదా దీపావళిర్భవేత్ ॥

అనువచనముచే అమావాస్యకు అపరాహ్ణవ్యాప్తియు ప్రదోష సమయమునకు స్వాతి సంయోగము ఉండుటచే శుక్రవారము దీపావళిని ఆచరించుటయే యుక్తము.

శ్లో॥ భూతాహే యే ప్రకుర్వన్తి ఉల్కాగ్రహమచేతనాః ।
నిరాశాః పితరోయాన్తి శాపం దత్వా సుదారుణమ్ ॥ ఇతి వచనాత్.

అను వచనమున బట్టి గురువారము ఆచరించుట తగదు.

# గోచారములు

## మేషరాశి

**అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదము (చూ,చే, చో, ల, లీ, లూ, లే, లో, అ)**

**ఆదాయం : 8, వ్యయం : 14 - రాజపూజ్యం : 4, అవమానం : 3**

వీరికి ఈ సంవత్సరమంతయు ఏకాదశమందు శని అనుకూలుడు కావున సర్వము అనుకూలించును. సకల కార్యములయందు లాభము, జయము, ప్రోత్సాహము కలుగును. ఆరోగ్యము, ద్రవ్యలాభము, భార్యాపుత్రాది స్వజనులలో మోదము కలుగును. గురువు చైత్రమున జన్మమందుండుటచే కొన్ని బాధలు తాత్కాలికముగ కలిగిననూ, మాసాంతము నుండి సంవత్సరాంతము వరకు ద్వితీయగురువు అయినందున ధనసంపాదన, సుఖము, కీర్తిప్రతిష్ఠలు, మాటగౌరవము పొందుట జరుగును. శుభమూలక ధనవ్యయము, సంతోషము కలుగును. సంవత్సరమంతయు వ్యయరాహువు మరియు షష్ఠకేతువు అయినందున లాభము, జయము, ప్రోత్సాహము కలుగును. ఆశ్వయుజ బహుళం నుండి నాలుగు మాసములు అర్ధాష్టమ కుజుడు కనుక ప్రయాణాదులయందు, వాహనముల విషయములో జాగ్రత్త అవసరము.

**అశ్విని** వారికి, చైత్ర శుక్ల సప్తమి నుండి భాద్రపద శుక్ల దశమి వరకు, తిరిగి పుష్య శుక్ల పూర్ణిమ నుండి సంవత్సరాంతము వరకు నైధనతారయందు శని సంచారము కలదు. ఆశ్వయుజ, మాఘ మాసములయందు నైధనతారయందు కుజుడు సంచరించుచున్నందున జాగ్రత్త అవసరము. **భరణి** వారికి ఆషాఢము నుండి ఫాల్గున శుక్లం వరకు నైధనతారయందు రాహువు సంచరించును. కార్తిక మార్గశిర పుష్యమాసములందు కుజుడు నైధనతారయందుండును. **కృత్తిక** వారికి, సంవత్సరారంభమున మూడు మాసములు నైధనతారయందు రాహువు మరియు కార్తిక బహుళం నుండి సంవత్సరాంతం వరకు జన్మతారయందు కేతువు సంచరించును. కావున వారు ఆయా సమయములలో ఆయా గ్రహములకు శాంతియొనర్చిన మేలు. దుర్గాసప్తశతి పారాయణము, సుబ్రహ్మణ్య దేవతారాధన వీరికి శ్రేయోదాయకములు.

## వృషభ రాశి

**కృత్తిక 2,3,4 పాదములు, రోహిణి, మృగశిర 1,2 పాదములు**

**(ఈ, ఊ, ఏ, ఓ, వా, వీ, వూ, వే, వో)**

**ఆదాయం : 2, వ్యయం : 8 - రాజపూజ్యం : 7, అవమానం : 3**

వీరికి ఈ సంవత్సరమంతయు దశమ శనియగుటచే ఉద్యోగ విఘ్నము, పాపకార్యాసక్తి, వ్యవసాయమునందు నష్టము కలుగును. తరచుగ తలచిన కార్యములయందు విఘ్నములు కలుగును. గురువు వ్యయ జన్మరాశుల యందు సంచరించుటచే ధనవ్యయము, స్థానచలనము కలుగును. పరిస్థితులు శ్రమకరముగ నుండగలవు. శుభమూలక ధనవ్యయము, రాజానుకూలత లేకపోవుట, కీర్తిహాని కలుగును. ఆస్తి సంబంధ విచారము, వ్యాజ్యములు కలుగును. సంవత్సరమంతయు ఏకాదశ రాహువు, పంచమ కేతువు అయినందున లాభము, జయము, ప్రోత్సాహము, గౌరవ మర్యాదలు, సన్మానము, పుత్రవిరోధము కలుగును. చైత్ర వైశాఖములందు, కార్తిక మార్గశిర పుష్యమాసములందు కుజానుకూలతచే కొన్ని సమస్యలు, వ్యాజ్యములు పరిష్కరించబడును. మిగిలిన మాసములందు కొంత జాగ్రత్త అవసరము.

**కృత్తిక** వారికి, సంవత్సరారంభమున మూడు మాసములు నైధనతారయందు రాహువు, కార్తిక బహుళం నుండి సంవత్సరాంతం వరకు జన్మతారయందు కేతువు సంచరించుదురు. **రోహిణి** వారికి, కార్తిక శుక్లం వరకు జన్మతారయందు కేతువు సంచరించును. కావున ఆయా కాలములందు ఆయా గ్రహములకు శాంతియొనర్చిన మేలు. శని గురువులకు కుజునికి విశేష శాంతియొనర్చవలయును. హనుమత్పూజాప్రదక్షిణలు, ఆదిత్యహృదయ పారాయణము వలన దోష పరిహారము కలుగును.

## మిథున రాశి

**మృగశిర 3,4 పాదములు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదములు**

**(కా, కి, కు, ఖం, ఙ, ఛ, కే, కో, హ)**

**ఆదాయం : 5 వ్యయం : 5 - రాజపూజ్యం : 3, అవమానం : 6**

వీరికి ఈ సంవత్సరమంతయు భాగ్యశనియగుటచే శుభకార్య విఘ్నము, పితృ లేదా సదృశ వ్యక్తికి తీరని కష్టము, మనోవ్యాకులత కలుగును. కళత్ర పుత్రమూలక వ్యథ, ఒకప్పుడు ధనలాభము, శుభము కలుగును. చైత్రమున ఏకాదశ గురువు అయినందున కొంత లాభము జయము ఉన్ననూ పిదప వ్యయగురువు అగుటచే అపనిందలు, ధనవ్యయము, స్థానచలనము కలుగును.

పరిస్థితులు శ్రమకరముగనుండగలవు. రాజాగ్రహమునకు గురియగుట, కీర్తిహాని, ఆస్తికి సంబంధించిన వివాదములు కలుగును. సంవత్సమంతయూ చతుర్థకేతువు, దశమ రాహువు అగుటచే శుభాశుభమిశ్రమముగనుండగలదు. చిత్తచాంచల్యము, వాతరోగములు, ప్రయాణాదులయందు ఇబ్బందులు ఉండును. ఆషాఢము నుండి కుజుడు వ్యయ, జన్మ, ద్వితీయ రాశులయందు సంచరించుటచే అనుకూలుడు కానందున ఆరోగ్యలోపము కలుగును.

**ఆర్ద్ర** వారికి, భాద్రపద బహుళం నుండి పుష్యశుక్లం వరకు జన్మతారయందు శని, కార్తిక బహుళం నుండి నైధనతార యందు కేతువు సంచరించుదురు. **పునర్వసు** వారికి, సంవత్సరారంభం నుండి భాద్రపద శుక్లం వరకు తిరిగి పుష్య పూర్ణిమ నుండి సంవత్సరాంతం వరకు జన్మతార యందు శని సంచారము, కార్తిక శుక్లం వరకు నైధనతార యందు కేతు సంచారము, ఆశ్వయుజ మాఘ ఫాల్గునములందు జన్మనక్షత్రమందు కుజ సంచారము కలదు. కావున ఆయా సమయములయందు ఆయా గ్రహములకు శాంతి అవసరము. నవగ్రహశాంతి చేసిన మేలు. గురుసేవ, హనుమత్పూజా ప్రదక్షిణముల వలన సకల దోషములు తొలగును.

## కర్కాటక రాశి

### పునర్వసు 4వ పాదము, పుష్యమి, ఆశ్లేష
### (హి, హు, హే, హో,డా, డీ, డూ, డే, డో )
### ఆదాయం : 14, వ్యయం : 2 - రాజపూజ్యం : 6, అవమానం : 6

వీరికి ఈ సంవత్సరమంతయు అష్టమశని అగుటచే మిక్కిలి శ్రమకరమగు కాలము. ప్రయత్నించినను కార్యములు సానుకూలపడవు. ధనవ్యయమగును. ప్రమాదములు, అపనిందలు, గౌరవహాని కలుగును. చైత్రమున దశమగురువు అగుటచే వృత్తి ఉద్యోగ వ్యాపారాదులయందు కొంచెం ఇబ్బందిగనున్ననూ అటుపిమ్మట లాభగురువు కనుక పరిస్థితులు అనుకూలించును. సంతానవృద్ధి నూతనకృషిలాభము, గౌరవము, యత్నకార్యసిద్ధి కలుగుటచే ఉత్సాహముగనుండును. కీర్తివృద్ధి, బలము, తేజస్సు విరోధినాశనము కలుగును. సంవత్సరమంతయూ భాగ్యరాహువు, తృతీయ కేతువు అయినందున పశునష్టము, ధనధాన్యనష్టము, మర్యాదాహాని కలుగును. కొంత లాభము, జయము ప్రోత్సాహము కలుగును. ఆషాఢ శ్రావణములయందు కుజానుకూలత వలన భూ గృహ వివాదములు సానుకూలముగ పూర్తి అగును. మొత్తము మీద శుభాశుభ మిశ్రమముగనుండును. ఆశ్వయుజ బహుళం నుండి ఆరోగ్య విషయమందు జాగ్రత్త అవసరము.

**పునర్వసు** వారికి, సంవత్సరారంభము నుండి భాద్రపద శుక్లం వరకు తిరిగి పుష్యపూర్ణిమ నుండి సంవత్సరాంతము వరకు జన్మతారయందు శని, కార్తిక శుక్లం వరకు నైధనతారయందు కేతువు సంచరించుదురు. ఆశ్వయుజ, మాఘ, ఫాల్గునములందు జన్మతారయందు కుజసంచారము కలదు. **పుష్యమి** వారికి, ఆషాఢ శుక్లం నుండి ఫాల్గున బహుళం వరకు జన్మతారయందు రాహువు సంచరించును. కార్తిక, మార్గశిర, పుష్య మాసములందు జన్మతారయందు కుజసంచారము కలదు. **ఆశ్లేష** వారికి, భాద్రపద బహుళం నుండి పుష్యశుక్లం వరకు నైధనతారయందు శని, ఆషాఢ శుక్లం వరకు జన్మతారయందు రాహువు సంచరించుదురు. కావున ఆయా సమయములందు ఆయా గ్రహములకు శాంతియొనర్చిన మేలు. మొత్తము మీద వీరు, శని రాహు కేతు కుజులకు శాంతియొనర్చిన మంచిది. ప్రతినెలా తమ జన్మనక్షత్రము రోజు, ప్రతి మాసశివరాత్రికి పరమేశ్వర ప్రీతిగా అభిషేకము చేయించిన సర్వదోషములు తొలగి సకల శ్రేయస్సులను పొందగలరు.

## సింహ రాశి

### మఘ, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని 1వ పాదము

### (మ, మి, ము, మె, మో, ట, టి, టు, టే )

### ఆదాయం : 2, వ్యయం : 14 - రాజపూజ్యం : 2, అవమానం : 2

వీరికి ఈ సంవత్సరము సప్తమశనియగుటచే అనుకూలము గాదు. కొన్ని ఇబ్బందులు వచ్చును. స్వజనవిరోధము, చోరాగ్ని బాధలు, ఆరోగ్యలోపము, అకాలభోజనము కలుగును. చైత్రమున భాగ్యగురువు అగుటచే చాలా వరకు అనుకూలించిననూ పిమ్మట దశమ గురువు అయినందున వృత్తి ఉద్యోగ వ్యాపారాదులయందు తరచుగ చిక్కులు, ఆస్తి నష్టం, సంతతిపీడ, గౌరవ భంగం కలుగవచ్చును. వృథా ప్రయాణములు, స్వజన విరోధము కలుగవచ్చును. సంవత్సరమంతయూ ద్వితీయ కేతువు, అష్టమ రాహువు అయినందున అకారణ కలహములు, అపనిందలు, చతుష్పాజ్జంతువుల వలన పీడ కలుగును. చైత్ర వైశాఖములందు సకల కార్యములయందు జాగ్రత్త అవసరము. బాగుగ ఆలోచించి గాని ఏపని చేయరాదు. భాద్రపద, ఆశ్వయుజ, మాఘ, ఫాల్గునములయందు ప్రయత్నించిన భూ గృహ సంపాదనకు అవకాశము కలదు.

**మఘ** వారికి, సంవత్సరారంభం నుండి భాద్రపద శుక్లము వరకు తిరిగి పుష్య బహుళం వరకు నైధనతారయందు శని, ఆశ్వయుజ మాఘ ఫాల్గునముల యందు నైధనతారయందు కుజుడు సంచరించుదురు.

**పూర్వఫల్గుని** వారికి, ఆషాఢం నుండి ఫాల్గున బహుళం వరకు నైధనతారయందు రాహువు, కార్తిక, మార్గశిర, పుష్యమాసముల యందు నైధనతారయందు కుజుడు సంచరించుదురు. **ఉత్తరఫల్గుని** వారికి, ఆషాఢ శుక్లం వరకు నైధనతార యందు రాహువు సంచరించును మరియు రాహువేధ కలదు. కార్తిక శుక్లం నుండి జన్మతార యందు కేతువు సంచరించును. కావున ఆయా సమయములందు జాగ్రత్తగా నుండవలయును. నవగ్రహ శాంతియొనర్చవలయును. సప్తశతి పారాయణము, అశ్వత్థనారాయణ సేవ, గురుసేవయొనర్చిన మంచిది.

# కన్యా రాశి

**ఉత్తరఫల్గుని 2, 3, 4 పాదములు, హస్త, చిత్ర 1, 2 పాదములు**

**(టో, పా, పి, పూ, ష, ణ, ఢ, పె, పో)**

**ఆదాయం : 5, వ్యయం : 5 - రాజపూజ్యం : 5, అవమానం : 2**

వీరికి ఈ సంత్సరము షష్ఠశనియగుటచే విశేషించి అనుకూలమయిన కాలము. తలచిన కార్యములు చాలావరకు నెరవేరును. శుభకార్యానుకూలత యుండును. సుఖము, ధనధాన్యవృద్ధి, ఇష్టబంధు సమాగమము కలుగును. గృహ నిర్మాణమునకు ప్రయత్నములు కలసి వస్తాయి. చైత్రమున అష్టమరాహువు వలన అకారణ కలహములు, అపనిందలు కలుగవచ్చును. కానీ అటు పిమ్మట భాగ్యగురువు అయినందున చాలా వరకు పరిస్థితులు అనుకూలించును. గౌరవ మర్యాదలు, కీర్తి ప్రతిష్ఠలు కలుగును. సంవత్సరమంతయూ సప్తమ రాహువు, జన్మకేతువు అయినందున వృథా వ్యయము, వృథా వైరములు కలుగును. తరచుగా ఇబ్బందులు, ఆరోగ్య లోపము, కళత్రవర్గములో పేచీలు ఏర్పడును. కార్తిక, మార్గశిర, పుష్య మాసములందు భూ గృహ సంపాదనకు అనుకూలము. వైశాఖ జ్యేష్ఠములందు ఆరోగ్య విషయమున జాగ్రత్త అవసరము.

**ఉత్తరఫల్గుని** వారికి, ఆషాఢ శుక్లం వరకు నైధనతార యందు రాహువు సంచరించును మరియు రాహువేధ కలదు. కార్తిక శుక్లం నుండి జన్మతారయందు కేతుసంచారము కలదు. **హస్త** వారికి, కార్తిక శుక్లం వరకు జన్మతారయందు కేతువు సంచరించును మరియు ఆషాఢ శుక్లం నుండి ఫాల్గున బహుళం వరకు రాహువేధ కలదు. **చిత్ర** వారికి, చైత్ర శుక్లం నుండి భాద్రపద శుక్లం వరకు తిరిగి పుష్య పూర్ణిమ నుండి శనివేధ గలదు. కావున ఆయా సమయములందు తగిన శాంతియొనర్చవలయును. మొత్తము మీద రాహు కేతువులకు శాంతియొనర్చిన మేలు. అశ్వత్థనారాయణ సేవ, ఆదిత్యహృదయ పారాయణము, సప్తశతి పారాయణము చేయుట మేలు.

## తులా రాశి

**చిత్ర 3,4 పాదములు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదములు**

**(రా, రి, రూ, రే, రో, త, తీ, తూ, తే)**

**ఆదాయం : 2, వ్యయం : 8 - రాజపూజ్యం : 1, అవమానం : 5**

వీరికి ఈ సంవత్సరమంతయు పంచమశనియగుటచే సంతానమునకు ఇబ్బందులు, మనస్తాపము, స్వజనవిరోధము కలుగును. సర్వము వ్యతిరేకముగ తోచును. ఆస్తినష్టము, కళత్రబంధుమూలక వ్యథ, తరచుగనేదో ఒక సమస్య, మర్యాదా భంగకరమయిన విషయములందాసక్తి కలుగును. చైత్రమున సప్తమగురువు అగుటచే అనూకూలమయిన కాలము. ఆరోగ్యము, రాజదర్శనము, ఇష్టకార్యార్థ సిద్ధి కలుగును. గౌరవ మర్యాదలు, కీర్తి ప్రతిష్ఠలు కలుగును. వైశాఖము నుండి అష్టమగురువు అగుటచే చోరాగ్ని శస్త్రబాధలు, అపనిందలు, భయము, గౌరవహాని కలుగును. సంవత్సరమంతయూ షష్ఠరాహువు, వ్యయకేతువు అయినందున సకల కార్యములయందు జయము ధైర్యము కలుగును. శత్రుజయము, గో భూ లాభము కలుగును. ఆదాయమునకు మించి వ్యయమగుటచే కొన్ని కార్యములయందు విఘ్నములు కలుగును. జ్యేష్ఠమాసము నుండి కుజుడు సప్తమాది దశమాంత రాశులయందు సంచరించును కావున అనుకూలుడు కాదు. జాగ్రత్త అవసరము.

**చిత్ర** వారికి, చైత్రశుక్లం నుండి భాద్రపద శుక్లం వరకు తిరిగి పుష్య పూర్ణిమ నుండి శనివేధ కలదు. **స్వాతి** వారికి, భాద్రపద శుక్లం నుండి పుష్యశుక్లం వరకు శనివేధ మరియు జన్మతారయందు శని సంచారము కలదు. కార్తిక శుక్లం నుండి సంవత్సరాంతము వరకు కేతువు నైధనతారయందు సంచరించును. **విశాఖ** వారికి, చైత్ర శుక్లం నుండి భాద్రపద శుక్లం వరకు తిరిగి పుష్య బహుళం నుండి జన్మతార యందు శని సంచారము కలదు. కార్తిక శుక్లం వరకు నైధనతారయందు కేతువు సంచరించును. కావున ఆయా సమయములందు ఆయాగ్రహములకు శాంతియొనర్చిన మేలు. గురుసేవ, సుబ్రహ్మణ్య స్వామి ఆరాధన వలన మేలు జరుగును.

## వృశ్చిక రాశి

**విశాఖ 4వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ**

**(తొ, నా, నీ, నూ, నే, నో, యా, యీ, యూ)**

**ఆదాయం : 8, వ్యయం : 14 - రాజపూజ్యం : 4, అవమానం : 5**

వీరికి ఈ సంవత్సరము అర్ధాష్టమశనియగుటచే విశేషించి శ్రమకరమగు కాలము. అనేక సమస్యలు వచ్చును. జాగ్రత్త అవసరము. కళత్రపీడ, ఆస్తినష్టము,

శారీరక మానసిక శ్రమ, స్వస్థానహాని, వాతబాధలు కలుగును. చైత్రమున షష్ఠ గురువు అయినందున శత్రుజ్ఞాతి బాధలు, వ్యాజ్యములు, చోర రోగ బాధలు అధికముగనుండగలవు. అయిననూ పిదప సప్తమ గురువు అయినందున అనూకూలమయిన కాలము. ఆరోగ్యము, రాజదర్శనము, ఇష్టకార్యసిద్ధి కలుగును. గౌరవ మర్యాదలు, కీర్తి ప్రతిష్ఠలు కలుగును. మొత్తం మీద అనూకూలముగ నుండగలదు. సంవత్సరమంతయూ పంచమరాహువు, ఏకాదశ కేతువు అయినందున కొంత లాభము, జయము, ప్రోత్సాహము, సన్మానము, పశులాభము పుత్రమూలక వ్యథ కలుగును. మొదటి మూడు మాసములు మినహా కుజుడు అనుకూలుడు గాదు. భాద్రపద ఆశ్వయుజములందు మరింత జాగ్రత్త అవసరము.

**విశాఖ** వారికి, చైత్ర శుక్లం నుండి భాద్రపద శుక్లం వరకు తిరిగి పుష్య బహుళం నుండి జన్మతారయందు శని, కార్తిక శుక్లం వరకు నైధనతార యందు కేతువు సంచరించుదురు. ఆశ్వయుజ, మాఘ, ఫాల్గునములందు జన్మతారయందు కుజసంచారము కలదు. **అనూరాధ** వారికి, ఆషాఢ శుక్లం నుండి ఫాల్గున బహుళం వరకు జన్మతారయందు రాహువు సంచరించును. కార్తిక మార్గశిర, పుష్య మాసములందు జన్మతారయందు కుజ సంచారము కలదు. **జ్యేష్ఠ** వారికి, భాద్రపద శుక్లం నుండి పుష్యశుక్లం వరకు నైధనతారయందు శని, ఆషాఢ శుక్లం వరకు జన్మతారయందు రాహువు సంచరించుదురు. మరియు కార్తిక, మార్గశిర, పుష్యమాసములందు కుజవేధ కలదు. కావున ఆయా సమయములందు ఆయా గ్రహములకు శాంతియొనర్చిన మేలు. శని, కుజులకు విశేషశాంతి అవసరము. ప్రతినెలలో తమ జన్మనక్షత్రము నాడు కార్తికమాసములో ప్రతి సోమవారం, మాసశివరాత్రికి పరమేశ్వర ప్రీతిగ అభిషేకము చేయించిన అర్ధాష్టమశని దోషము తొలగును.

# ధనూరాశి

**మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వపాదము**

**(యే, యొ, బా, బి, బూ, ధ, భ, ఢ, బె)**

**ఆదాయం : 11, వ్యయం : 5 - రాజపూజ్యం : 7, అవమానం : 5**

వీరికి ఈ సంవత్సరమంతయు తృతీయశని అనుకూలుడగుటచే చాలావరకు అనుకూలమయిన కాలము. ఋణవిముక్తి, భూ గృహ సంపాదన, ఉద్యోగప్రాప్తి కలుగును. స్వబుద్ధితో యత్నించిన కార్యములు సిద్ధించును. భ్రాతృవర్గములో గల వ్యాజ్యములు, పేచీలు పరిష్కరించబడును. చైత్రమున పంచమ గురువు అగుటచే చాలా వరకు అనుకూలముగనుండును. పిదప షష్ఠగురువు

అయినందున శత్రుజ్ఞాతి బాధలు, వ్యాజ్యములు, చోరరోగ బాధలు అధికముగనుండగలవు. సంవత్సరమంతయు చతుర్థ రాహువు, దశమ కేతువు అయినందున వృత్తి ఉద్యోగ వ్యాపారాదులయందు చిక్కులు, ఆస్తినష్టం, గృహమందు అశాంతి కలుగును. మాతృవర్గ బంధు జనులతో పేచీలు, చిత్తచాంచల్యము, ప్రయాణాదులయందు విఘ్నములు, వాతరోగములు కలుగును. మధ్య మధ్య సుఖము, ఇష్టభోజనము, శరీర దార్ఢ్యము కలుగును. భాద్రపదం నుండి సంవత్సరాంతము వరకు కుజుడు సప్తమ, అష్టమ రాశులలో సంచరించును కనుక మరింత జాగ్రత్త అవసరము.

**మూలా** నక్షత్రము వారికి, చైత్రశుక్లం నుండి భాద్రపద శుక్లం వరకు, తిరిగి పుష్య బహుళం నుండి సంవత్సరాంతం వరకు నైధనతార యందు శని, ఆశ్వయుజ మాఘ ఫాల్గునములయందు నైధనతారయందు కుజుడు సంచరించుదురు. మరియు కుజవేధ కలదు. సంవత్సరాంతమున సర్పభీతి కలదు. **పూర్వాషాఢ** వారికి ఆషాఢ శుక్లం నుండి ఫాల్గున బహుళం వరకు నైధనతారయందు రాహువు, కార్తిక, మార్గశిర, పుష్యమాసములందు నైధనతారయందు కుజుడు సంచరించుదురు. **ఉత్తరాషాఢ** వారికి, ఆషాఢ శుక్లం వరకు నైధనతారయందు రాహువు, కార్తిక శుక్లం వరకు జన్మతారయందు కేతువు సంచరించుదురు. కావున ఆయా సమయములందు ఆయా గ్రహములకు శాంతియొనర్చిన మేలు. మొత్తము మీద వీరు, గురు రాహు కేతు కుజులకు శాంతి చేయవలయును. హనుమత్పూజా ప్రదక్షిణములు, సప్తశతి పారాయణము, గురుసేవ చేయుట వలన దోషములు తొలగును.

## మకర రాశి

**ఉత్తరాషాఢ 2, 3, 4 పాదములు, శ్రవణ, ధనిష్ఠ 1, 2 పాదములు**
**(బో, జా, జీ, జూ, జే, జో, ఖ, గ, గీ)**
**ఆదాయం : 14, వ్యయం : 14 - రాజపూజ్యం : 3, అవమానం : 1**

వీరికి ఈ సంవత్సరమంతయు ద్వితీయ శనియగుటచే ధనవ్యయము, తేజోహాని, అకారణ కలహములు కలుగును. ఎల్లప్పుడు కష్టములు, కార్యనాశనము, స్వజన విరోధము, పాపచింతన కలుగును. చైత్రమున గురువు చతుర్థమందుండటచే బుద్ధిచాంచల్యము, తేజోహాని, ప్రవాసము, బంధుమూలక వ్యథ కలుగును. పిమ్మట పంచమ గురువు అగుటచే చాలా వరకు పరిస్థితులు అనుకూలించును. పుత్రవృద్ధి, సుజన మిత్రత్వము, ప్రభు అనుకూలత కలుగును. సంవత్సరమంతయూ తృతీయ రాహువు, భాగ్యకేతువు అగుటచే తలచిన కార్యములు నెరవేరును. భ్రాతృద్వేషము,

మర్యాదాహాని, పాడిపంటలకు ఇబ్బంది ఒకప్పుడు కలుగును. వైశాఖ, భాద్రపద, ఆశ్వయుజ, మాఘ, పాల్గునములందు భూ గృహ సంపాదనకు, వివాద పరిష్కారములకు అనుకూలమయిన కాలము. కార్తిక, మార్గశిర, పుష్యమాసముల యందు ఆర్థికంగా, ఆరోగ్యపరంగా జాగ్రత్త అవసరము.

**ఉత్తరాషాఢ** వారికి, ఆషాఢ శుక్లం వరకు నైధనతార యందు రాహువు, కార్తిక శుక్లం వరకు జన్మతార యందు కేతువు సంచరించుదురు. **శ్రవణ** వారికి, కార్తిక శుక్లం వరకు జన్మతార యందు కేతువు సంచరించును. కావున ఆయా నక్షత్రముల వారు ఆయా సమయములందు ఆయా గ్రహములకు శాంతియొనర్చిన మేలు. ముఖ్యముగా సంవత్సర ప్రారంభములో శనికి, చివరిలో కుజునకు శాంతియొనర్చిన మేలు. గురుసేవ, సుందరకాండ పారాయణముతో పాటు, ప్రతిమాసము మాసశివరాత్రికి పరమేశ్వర ప్రీతిగ అభిషేకము చేసినచో మేలు జరుగును.

## కుంభ రాశి

**ధనిష్ఠ 3, 4 పాదములు, శతతార, పూర్వాభాద్ర 1, 2, 3 పాదములు**

**(గు, గె, గో, స, సి, సు, సె, సో, దా)**

**ఆదాయం : 14, వ్యయం : 14 - రాజపూజ్యం : 6, అవమానం : 1**

వీరికి ఈ సంవత్సరమంతయు జన్మరాశిలో శని కావున మిక్కిలి శ్రమకరమగు కాలము. ఏకార్యము సానుకూలము గాదు. వృథా కార్యములయందు అలసట, భార్యాపుత్రాది స్వజనవిరోధము, ఆరోగ్యలోపములు బాధించును. తేజోహాని, మతిభ్రంశము, భయము కలుగును. జనన సమయమున శని బలము బాగున్న అంత బాధ కలుగదు. చైత్రమున గురువు తృతీయ చతుర్థ రాశులయందు సంచరించుటచే అనుకూలుడు గాదు. కొన్ని కార్యములు నెరవేరిననూ, ఉద్యోగ భంగము, మిత్రవియోగము, కార్యభంగము, బంధువియోగము, తేజోహాని, స్వస్థానత్యాగము ఒకప్పుడు కలుగును. సంవత్సరమంతయూ ద్వితీయ రాహువు, అష్టమ కేతువు అయినందున వృథా వైరములు వ్యయములు, అధిక ప్రయాస కలుగును. జ్యేష్ఠ కార్తిక మార్గశిర పుష్య మాసములయందు కొంత అనుకూల పరిస్థితులుండును. చైత్ర ఆషాఢ శ్రావణములు మిక్కిలి శ్రమకరమయిన కాలము కావున జాగ్రత్త అవసరము.

**శతతార** వారికి, భాద్రపద శుక్లం నుండి పుష్య శుక్లం వరకు జన్మతారయందు శని, కార్తిక శుక్లం నుండి సంవత్సరాంతం వరకు నైధనతారయందు కేతువు సంచరించుదురు. **పూర్వాభాద్ర** వారికి, చైత్రశుక్లం నుండి

భాద్రపద శుక్లం వరకు, పుష్య శుక్లం నుండి సంవత్సరాంతము వరకు జన్మతారయందు శని సంచారము కలదు. కార్తిక శుక్లం వరకు నైధనతారయందు కేతువు, ఆశ్వయుజ మాఘ ఫాల్గునములందు జన్మతారయందు కుజుడు సంచరించుదురు. కావున ఆయా సమయములందు సాహస కార్యములు మానవలయును. నవగ్రహశాంతి యొనర్చిన మేలు. హనుమత్పూజా ప్రదక్షిణములు, గురుసేవ, సప్తశతిపారాయణముతో పాటు ప్రతిమాసమున తమ జన్మనక్షత్రము రోజున, కార్తిక మాసమున ప్రతి సోమవారము, మాసశివరాత్రికి పరమేశ్వర ప్రీతిగ అభిషేకము చేసిన సకల దోషములు తొలగగలవు.

## మీన రాశి

**పూర్వాభాద్ర 4వపాదము, ఉత్తరాభాద్ర, రేవతి**

**(ది, దు, శం, ఝ, థ, దె, దొ, చ, చి)**

**ఆదాయం : 11, వ్యయం : 5 - రాజపూజ్యం : 2, అవమానం : 4**

వీరికి ఈ సంవత్సరమంతయు ద్వాదశ శనియగుటచే జాగ్రత్త అవసరము. ఆరోగ్యలోపములు, బంధు వైరములు, గృహచ్ఛిద్రములు బాధించును. వృథా వ్యయములు కలుగును. వ్యవసాయమునందు నష్టమెక్కువ. మానసిక అశాంతి ఎక్కువగనుండును. వృథా వాదనలకు చోటివ్వరాదు. చైత్రమున ద్వితీయ గురువు అయినందున ధనసంపాదన, సుఖము, కీర్తి ప్రతిష్ఠలు, మాటగౌరవము పొందుట జరుగును. ధర్మకార్యములయందు ధనవ్యయము కలుగును. పిదప తృతీయ గురువు అయినందున శ్రమ అధికము. ఉద్యోగభంగము, వృథా వైరములు బాధించును. బంధు విరోధములు ఒకప్పుడు బాధించును. సంవత్సరమంతయూ జన్మరాహువు, సప్తమ కేతువు అయినందున భార్యాపుత్రాది స్వజనులతో వైరములు, ఆరోగ్య లోపము, వృథావ్యయము, కళత్రవర్గముతో పేచీలు ఏర్పడగలవు. ఆషాఢ శ్రావణ మాసములందు కొంత అనుకూల పరిస్థితులుండును. భాద్రపదం నుండి కుజుడు అనుకూలుడు కాదు కావున జాగ్రత్త అవసరము.

**పూర్వాభాద్ర** వారికి, చైత్ర శుక్లం నుండి భాద్రపద శుక్లం వరకు, పుష్య శుక్లం నుండి సంవత్సరాంతం వరకు జన్మతారయందు శని సంచారము, ఆశ్వయుజ, మాఘ, ఫాల్గునములయందు జన్మతారయందు కుజ సంచారము కలదు. **ఉత్తరాభాద్ర** వారికి, ఆషాఢ శుక్లం నుండి ఫాల్గున బహుళం వరకు జన్మతారయందు రాహువు, కార్తిక మార్గశిర పుష్య మాసములందు జన్మతారయందు కుజడు సంచరించుదురు.

సంవత్సరారంభము నుండి కార్తిక శుక్లం వరకు కేతువేధ కలదు. **రేవతి** వారికి, భాద్రపద శుక్లం నుండి పుష్య శుక్లం వరకు నైధనతారయందు శని, ఆషాఢ శుక్లం నుండి ఫాల్గున బహుళం వరకు జన్మతారయందు రాహువు సంచరించుదురు. కార్తిక శుక్లం నుండి సంవత్సరాంతము వరకు కేతువేధ కలదు. మెత్తం మీద వీరు నవగ్రహశాంతి యొనర్చిన మేలు. సప్తశతి పారాయణము, సుందరకాండ పారాయణముతో పాటు అశ్వత్థనారాయణ సేవ, గురుసేవయొనర్చిన సమస్యలు తొలగును.



## సూచన

జాతక గ్రహస్థితి, దశాంతర్దశలు, వామ పార్శ్వ సుముఖ వేధలు మరియు అష్టకవర్గ న్యూనాధిక బిందుఫలములు మొదలగు ఇతర కారణములచే స్థూలంగా సూచించబడిన ఈ ఫలితములు ఈషద్వైషమ్యముగా మాత్రమే సంభవించును. నవగ్రహ బలాబలములచే ఇందు కొంత మార్పు కలుగును.



# సుముహూర్తములు

ఈ సంవత్సరము ఉత్తమ ముహూర్తములు నిర్దుష్టములగునవి అతి స్వల్పము. ఉన్నంతలో మెరుగైనవి సూచించబడినవి. విజ్ఞులు నీర క్షీర న్యాయమున గ్రహించ ప్రార్థితులు.

## చైత్ర మాసము

9-4-24 చైత్ర శుక్ల ౧ మంగళవారం రేవతీయుక్త మేషం ౩.౨౬ ఉ॥7.22 (సంవత్సరాది కనుక నూతన ఆరంభములకు).

12-4-24 చైత్ర శుక్ల ౪ శుక్రవారం రోహిణీయుక్త మేషం ౩.౨ ఉ॥7.8 (చోరః).

15-4-24 చైత్ర శుక్ల ౭ సోమవారం పునర్వసుయుక్త వృషభం ౫.౫౮ ఉ॥8.16 గృహారంభాదులు.

18-4-24 చైత్ర శుక్ల ౧౦/౧౧ గురువారం మఘాయుక్త వృశ్చికం ౩౫.౪౭ రా॥8.10 వివాహం.

19-4-24 చైత్ర శుక్ల ౧౧ శుక్రవారం మఘాయుక్త మిథునం ౧౨.౦౦ ఉ॥10.39 వివాహం.

20-4-24 చైత్ర శుక్ల ౧౨/౧౩ శనివారం ఉత్తరఫల్గునీయుక్త వృశ్చికం ౩౫.౩౧ రా॥8.3 వివాహం.

21-4-24 చైత్ర శుక్ల ౧౩ ఆదివారం హస్తయుక్త ధనుస్సు ౪౩.౪౦ రా॥11.18 వివాహాదులు.

22-4-24 చైత్ర శుక్ల ౧౪ సోమవారం హస్తయుక్త మిథునం ౧౧.౩౬ ఉ॥10.28 ఆవశ్యక గృహారంభాదులు.

24-4-24 చైత్ర కృష్ణ ౧ బుధవారం స్వాతీయుక్త మిథునం ౧౧.౨౧ ఉ॥10.22 వివాహం, గృహారంభం. ధనుస్సు ౪౩.౧౬ రా॥11.6 వివాహం.

## శ్రావణ మాసము

8-8-24 శ్రావణ శుక్ల ౪/౫ గురువారం హస్తయుక్త మిథునం ౫౫.౦౦ రా॥3.51 వివాహం.

10-8-24 శ్రావణ శుక్ల ౬/౭ శనివారం స్వాతీయుక్త మిథునం ౫౪.౩౮ రా॥3.43 వివాహం.

11-8-24 శ్రావణ శుక్ల ౭ ఆదివారం స్వాతీయుక్త మేషం ౪౪.౩౬ రా॥11.41 వివాహం. మిథునం ౫౪.౨౮ రా॥3.38 వివాహం.

15-8-24 శ్రావణ శుక్ల ౧౧ గురువారం మూలాయుక్త మేషం ౪౩.౫౪ రా॥11.26 వివాహం. మిథునం ౫౩.౪౬ రా॥3.22.

18-8-24 శ్రావణ శుక్ల ౧౪ ఆదివారం శ్రవణయుక్త మేషం ౪౩.౨౩ రా॥11.14 ౧౫ మిథునం ౫౩.౧౫ రా॥3.11 వివాహం.

22-8-24 శ్రావణ కృష్ణ ౩/౪ గురువారం ఉత్తరాభాద్రాయుక్త మేషం ౪౨.౫౧ రా॥10.58 (౧౨ చంద్రః) వివాహం.

23-8-24 శ్రావణ కృష్ణ ౪/౫ శుక్రవారం రేవతీయుక్త మేషం ౪౨.౪౦ రా॥10.54 వివాహం (౧౨ చంద్రః).
అశ్వినీయుక్త మిథునం ౫౨.౩౩ రా॥2.55 వివాహం.

28-8-24 శ్రావణ కృష్ణ ౧౦ బుధవారం మృగశిరాయుక్త తుల ౧౨.౫౭ ఉ॥11.6.

## ఆశ్వయుజ మాసము

5-10-24 ఆశ్వయుజ శుక్ల ౩ శనివారం స్వాతీయుక్త తుల ౬.౨౨ ఉ॥8.22 (లగ్నచంద్రః).

7-10-24 ఆశ్వయుజ శుక్ల ౫ సోమవారం అనూరాధాయుక్త తుల ౬.౧ ఉ॥8.14.

9-10-24 ఆశ్వయుజ శుక్ల ౬/౭ బుధవారం మూలాయుక్త వృశ్చికం ౮.౦౦ ఉ॥9.11 (౮ కుజః).

13-10-24 ఆశ్వయుజ శుక్ల ౧౧ ఆదివారం ధనిష్ఠాయుక్త మేషం ౩౩.౩౭ రా॥7.27 వివాహం.

16-10-24 ఆశ్వయుజ శుక్ల ౧౪/౧౫ బుధవారం రేవతీయుక్త వృషభం ౩౬.౨౫ రా॥8.34 వివాహం.

26-10-24 ఆశ్వయుజ కృష్ణ ౧౦ శనివారం మఘాయుక్త మిథునం ౪౧.౧౩ రా॥10.32 వివాహం.

## కార్తిక మాసము

8-11-24 కార్తిక శుక్ల ౭ శుక్రవారం ఉత్తరాషాఢాయుక్త వృశ్చికం ౨.౪౬ ఉ॥7.10 వివాహం, గృహారంభం. శ్రవణయుక్త ధనుస్సు ౧౦.౫౨ ఉ॥10.29 (౮ కుజః).

9-11-24 కార్తిక శుక్ల ౮/౯ శనివారం ధనిష్ఠాయుక్త మిథునం ౩౮.౪౭ రా॥9.40 వివాహం.

10-11-24 కార్తిక శుక్ల ౯ ఆదివారం శతతారాయుక్త ధనుస్సు ౧౦.౩౧ ఉ॥10.21. వివాహం, గృహారంభం (౮ కుజః).
౧౦ శతతారాయుక్త మిథునం ౩౮.౩౬ రా॥9.36 (మతాంతరం) వివాహం.

13-11-24 కార్తిక శుక్ల ౧౨/౧౩ బుధవారం రేవతీయుక్త ధనుస్సు ౧౦.౦౦ ఉ॥10.10 (౮ కుజః). గృహారంభం, వివాహం.

17-11-24 కార్తిక కృష్ణ ౨ ఆదివారం రోహిణీయుక్త ధనుస్సు ౯.౧౭ ఉ॥9.56 (౬ చంద్రః, ౮ కుజః).

20-11-24 కార్తిక కృష్ణ ౫ బుధవారం పునర్వసుయుక్త ధనుస్సు ౮.౪౫ ఉ॥9.44
౬ పుష్యమీయుక్త మిథునం ౩౬.౫౦ రా॥8.58 గృహప్రవేశం.

22-11-24 కార్తిక కృష్ణ ౭/౮ శుక్రవారం మఘాయుక్త మిథునం ౩౬.౨౮ రా॥8.51.

25-11-24 కార్తిక కృష్ణ ౧౦ సోమవారం ఉత్తరఫల్గునీయుక్త మిథునం ౩౫.౫౪ రా॥8.39 గృహప్రవేశం.

## మార్గశిర మాసము

4-12-24 మార్గశిర శుక్ల ౩/౪ బుధవారం ఉత్తరాషాఢాయుక్త మిథునం ౩౪.౧౪ రా॥8.4 (౭ చంద్రః) వివాహం. తుల ౫౫.౪౪ రా॥4.40 వివాహం.

5-12-24 మార్గశిర శుక్ల ౪ గురువారం ఉత్తరాషాఢాయుక్త ధనుస్సు ౫.౫౮ ఉ॥8.45 (౮ కుజః) వివాహం. శ్రవణయుక్త తుల ౫౫.౩౩ రా॥4.36

7-12-24 మార్గశిర శుక్ల ౬ శనివారం ధనిష్ఠాయుక్త ధనుస్సు ౫.౩౬ ఉ॥8.37 (౮ కుజః). ౭ శతతారాయుక్త తుల ౫౫.౧౧ రా॥4.27.

8-12-24 మార్గశిర శుక్ల ౭/౮ ఆదివారం శతతారాయుక్త ధనుస్సు ౫.౨౪ ఉ॥8.32.

11-12-24 మార్గశిర శుక్ల ౧౧ బుధవారం రేవతీయుక్త ధనుస్సు ౪.౫౧ ఉ॥8.24 వివాహం, గృహారంభం.

14-12-24 మార్గశిర శుక్ల ౧౪ శనివారం రోహిణీయుక్త ధనుస్సు ౪.౨౫ ఉ॥8.14 వివాహం, గృహారంభం.

15-12-24 మార్గశిర శుక్ల ౧౫ ఆదివారం మృగశిరాయుక్త ధనుస్సు ౪.౧౪ ఉ॥8.10 వివాహం, గృహారంభం (౮ కుజః).

20-12-24 మార్గశిర కృష్ణ ౫/౬ శుక్రవారం మఘాయుక్త తుల ౫౨.౪౩ రా॥3.36.

## మాఘ మాసము

31-1-25 మాఘ శుక్ల ౨/౩ శుక్రవారం శతతారాయుక్త వృశ్చికం ౪౭.౩౬ రా॥1.38 వివాహం (శుభజామిత్రం).

2-2-25 మాఘ శుక్ల ౪/౫ ఆదివారం ఉత్తరాభాద్రాయుక్త వృశ్చికం ౪౭.౧౫ రా॥1.30 వివాహం.

6-2-25 మాఘ శుక్ల ౯/౧౦ గురువారం రోహిణీయుక్త వృశ్చికం ౪౬.౩౩ రా॥1.14 వివాహం (౭ చంద్రః, గురుః).

7-2-25 మాఘ శుక్ల ౧౦ శుక్రవారం రోహిణీయుక్త మేషం ౧౨.౨౨ ఉ॥11.34 వివాహం, గృహారంభం.

8-2-25 మాఘ శుక్ల ౧౧ శనివారం మృగశిరాయుక్త మేషం ౧౨.౧౧ ఉ॥11.30 (చోరః) వివాహం.

10-2-25 మాఘ శుక్ల ౧౩ సోమవారం పునర్వసుయుక్త మేషం ౧౧.౫౦ ఉ॥11.20.

15-2-25 మాఘ కృష్ణ ౩ శనివారం ఉత్తరఫల్గునీయుక్త మేషం ౧౧.౧ ఉ॥10.58 వివాహం. ౪ హస్తయుక్త మకరం ౫౬.౫౪ రా॥5.20.

16-2-25 మాఘ కృష్ణ ౪/౫ ఆదివారం చిత్రాయుక్త మకరం ౫౬.౪౫ రా॥5.16 వివాహం.

16-2-25 మాఘ కృష్ణ ౫ సోమవారం చిత్రాయుక్త మేషం ౧౦.౪౩ ఉ॥10.51 (మార్తాండ రహితం) (౬ చంద్రః), గృహారంభం, ఉపనయనం.

23-2-25 మాఘ కృష్ణ ౧౦/౧౧ ఆదివారం మూలాయుక్త మేషం ౯.౪౯ ఉ॥10.25 వివాహం.

## ఫాల్గున మాసము

1-3-25 ఫాల్గున శుక్ల ౨/౩ శనివారం ఉత్తరాభాద్రాయుక్త మకరం ౫౪.౪౭ రా॥4.21 వివాహం.

2-3-25 ఫాల్గున శుక్ల ౩ ఆదివారం ఉత్తరాభాద్రాయుక్త మేషం ౮.౪౫ ఉ॥9.56 వృషభం ౧౨.౪ ఉ॥11.6 వివాహం, దేవతాప్రతిష్ఠ.

3-3-25 ఫాల్గున శుక్ల ౪ సోమవారం అశ్వినీయుక్త వృషభం ౧౧.౫౪ ఉ॥11.2.

6-3-25 ఫాల్గున శుక్ల ౭/౮ గురువారం రోహిణీయుక్త మకరం ౫౪.౧ రా॥3.58 వివాహం.

9-3-25 ఫాల్గున శుక్ల ౧౦/౧౧ ఆదివారం పునర్వసుయుక్త వృషభం ౧౧.౦౦ ఉ॥10.44 గృహారంభం.

10-3-25 ఫాల్గున శుక్ల ౧౧ సోమవారం పుష్యమీయుక్త మేషం ౭.౩౨ ఉ॥9.21 (రాజ) ఉపనయనం.

12-3-25 ఫాల్గున శుక్ల ౧౩/౧౪ బుధవారం మఘాయుక్త వృషభం ౧౦.౩౩ ఉ॥10.30 వివాహం.

15-3-25 ఫాల్గున కృష్ణ ౧ శనివారం హస్తయుక్త వృషభం ౧౦.౭ ఉ॥10.20 వివాహం, ౨ హస్తయుక్త మకరం ౫౨.౪౧ రా॥3.21 వివాహం.

## జనన ప్రకరణము

అశ్విని 1వ పాదం తండ్రికి - భరణి 4వ పాదం శిశువుకు - కృత్తిక 4వ పాదం తల్లికి - రోహిణి మేనమామకు, తండ్రికి - ఆర్ద్ర తల్లికి - పుష్యమి 2,3 పాదములు పగలు తండ్రికి, రాత్రి తల్లికి - ఆశ్లేష 2వ పాదం శిశువుకు, 3వ పాదం తల్లికి, 4వ పాదం తండ్రికి - మఘ 1,2 పాదములు తండ్రికి - పూర్వఫల్గుని 4వ పాదం తల్లికి - ఉత్తరఫల్గుని 1వ పాదం పగలు తండ్రికి, రాత్రి తల్లికి - హస్త 3వ పాదం పుత్రుడైన తండ్రికి, పుత్రికయైన తల్లికి - చిత్ర 1వ పాదం తల్లికి, 2వ పాదం తండ్రికి - విశాఖ 4వ పాదం తల్లికి - జ్యేష్ఠ 1వ పాదం తల్లికి, 2వ పాదం సోదరులకు, మేనమామలకు, 3వ పాదం శిశువులకు, 4వ పాదం తండ్రికి - మూల 1వ పాదం తండ్రికి, 2వ పాదం తల్లికి, 3,4 పాదములు ధనమునకు - పూర్వాషాఢ 3వ పాదం తండ్రికి - పూర్వాభాద్ర 4వ పాదం శిశువునకు - రేవతి 4వ పాదం తండ్రికి గండము కాన యథావిధిగా శాంతి జరుపవలెను. కృష్ణ చతుర్దశి, అమావాస్య, వర్జ్యము, గ్రహణ కాలములందు గాని, మాతాపితృ సోదరుల జన్మ నక్షత్రములందు జననమైనను, నాళ వేష్ట (ప్రేగు మెడలోవేసుకుని) జననమైనను వికృత జననమైనను ఆయా విశేషశాంతులను జరుపుకొనవలెను.

## జన్మనక్షత్రమును బట్టి గ్రహదశలెఱుంగుట

| | | |
|---|---|---|
| కృత్తిక, ఉత్తరఫల్గుని, ఉత్తరాషాఢ | రవిదశ | 6 సంవత్సరములు |
| రోహిణి, హస్త, శ్రవణ | చంద్రదశ | 10 సంవత్సరములు |
| మృగశిర, చిత్ర, ధనిష్ఠ | కుజదశ | 7 సంవత్సరములు |
| ఆర్ద్ర, స్వాతి, శతతార | రాహుదశ | 18 సంవత్సరములు |
| పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర | గురుదశ | 16 సంవత్సరములు |
| పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర | శనిదశ | 19 సంవత్సరములు |
| ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి | బుధదశ | 17 సంవత్సరములు |
| మఘ, మూల, అశ్విని | కేతుదశ | 7 సంవత్సరములు |
| పూర్వఫల్గుని, పూర్వాషాఢ, భరణి | శుక్రదశ | 20 సంవత్సరములు |

## జన్మరాశి, నామరాశి వల్ల చేయు కార్యములు

గృహము, వాస్తుకర్మ, వ్యవహారము, మంత్రము, యంత్రము, దానము, చుట్టరికము, రాజసేవ, భూబలము, వర్గు శుద్ధి, యుద్ధము, యాత్రాదులకు నామ నక్షత్రము చూడవలయును. తక్కిన వివాహాది శుభకార్యములకును, శరీరమును గురించిన శుభాశుభములకు జన్మ నక్షత్రమును చూడవలయును. నలుబది సంవత్సరములకు పైన జన్మనక్షత్రము చూడగూడదను వాడుకయున్నది. ఇది శాస్త్రమునకు విరుద్ధము. జన్మముండు వరకు జన్మనక్షత్రము చూడవలయును.

## నామ నక్షత్రములను తెలుసుకొను విధము

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| చు | చె | చో | ల | అశ్విని | రూ | రె | రో | త | స్వాతి |
| లీ | లూ | లె | లో | భరణి | తి | తు | తె | తో | విశాఖ |
| అ | ఈ | ఉ | ఏ | కృత్తిక | నా | నీ | నూ | నె | అనూరాధ |
| ఓ | వా | వీ | వూ | రోహిణి | నో | యా | యి | యు | జ్యేష్ఠ |
| వే | వో | కా | కి | మృగశిర | యె | యో | బా | బీ | మూల |
| కూ | ఖ | జ్ఞ | ఝ | ఆర్ద్ర | బూ | ధా | బా | ఢా | పూర్వాషాఢ |
| కె | కో | హా | హీ | పునర్వసు | బె | బో | జా | జీ | ఉత్తరాషాఢ |
| హూ | హె | హో | డ | పుష్యమి | జు | జే | జో | ఖా | అభిజిత్ |
| డీ | డూ | డే | డో | ఆశ్లేష | ఖి | ఖు | ఖె | ఖో | శ్రవణ |
| మా | మీ | మూ | మె | మఘ | గా | గీ | గు | గే | ధనిష్ఠ |
| మో | టా | టీ | టు | పూ.ఫ | గో | సా | సీ | సు | శతతార |
| టె | టో | పా | పీ | ఉత్తర | సే | సో | దా | ది | పూర్వాభాద్ర |
| పూ | ష | ణ | ఢ | హస్త | దు | శం | ఛా | ధా | ఉత్తరాభాద్ర |
| పె | పో | రా | రి | చిత్ర | దె | దో | చా | చీ | రేవతి |

## మేషాది జన్మరాశులకు ఘాతతిథ్యాదులను దెలుపు చక్రము

| లగ్నము | తిథి | వారము | నక్షత్రము | చంద్రుడు |
|---|---|---|---|---|
| మేషం | ౬ | ఆది | మఘ | జన్మ |
| వృషభం | ౪ | శని | హస్త | పంచమ |
| మిథునం | ౮ | సోమ | స్వాతి | సప్తమ |
| కర్కటకం | ౯ | బుధ | అనూరాధ | ద్వితీయ |
| సింహం | ౯ | శని | మూల | షష్ఠ |
| కన్య | ౮ | శని | శ్రవణ | దశమ |
| తుల | ౧౨ | గురు | శతతార | తృతీయ |
| వృశ్చికం | ౧౦ | శుక్ర | రేవతి | సప్తమ |
| ధనుస్సు | ౨ | శుక్ర | భరణి | ద్వితీయ |
| మకరం | ౧౨ | కుజ | రోహిణి | అష్టమ |
| కుంభం | ౪ | గురు | ఆర్ద్ర | ఏకాదశ |
| మీనం | ౨ | శుక్ర | ఆశ్లేష | ద్వాదశ |

## తిథ్యంత గండములు

అమావాస్య ప్రతిపత్తులయొక్కయు, దశమ్యేకాదశుల యొక్కయు, పూర్ణిమా ప్రతిపత్తులయొక్కయు సంధియందు రెండు ఘడియలు శిశుగండము.

## గండ పురుషస్థితి

చైత్ర - భాద్రపద - ఆశ్వయుజ - కార్తిక మాసములయందు పాతాళంబునను, వైశాఖ - శ్రావణ - మాఘ - ఫాల్గున మాసములందు స్వర్గలోకంబునను, జ్యేష్ఠ - ఆషాఢ - మార్గశీర్ష - పౌష్య మాసములందు భూలోకమున సంచరించును. భూలోకమున సంచరించునపుడు రజస్వల, ప్రసూతి మొదలగునవి సంభవించిన యెడల మరణము కలుగజేయును. తక్కిన రెండు ప్రదేశములయందు శుభము కలుగజేయును.

## రాశిగండములు

మీనమేషముల యొక్కయు, కర్కటక సింహముల యొక్కయు, వృశ్చిక ధనుస్సుల యొక్కయు సంధి యందు అర్ధఘటిక శిశు గండము. ఈ దుష్ట నక్షత్రాదికమునందు జననమైన శిశువుకు అష్టావాక్య జపమును, హోమమును, రుద్రాభిషేకమును, అశ్వత్థ ప్రదక్షిణములను, అన్నదానమును యథావిధిగాజేసిన యెడల ఆయా గండములకు శాంతియగును. తిథిగండమునకు వృషభమును, నక్షత్రగండమునకు గోవును, లగ్న గండమునకు కాంచనమును దానమియ్యవలెను.

విష ఘడియలలో మొదటి ఘడియయందు జననమయిన తండ్రికి, రెండవ ఘడియ తల్లికి, మూడవ ఘడియ ధనమునకు(ధనహాని), నాలుగవ ఘడియ శిశువునకు దోషము.

## జ్యేష్ఠా నక్షత్రమునందలి 10 భాగములు

| | | | |
|---|---|---|---|
| 1వ భాగం | తల్లితల్లికి | 6వ భాగం | శిశువంశమునకు |
| 2వ భాగం | తల్లి తండ్రికి | 7వ భాగం | ఉభయవంశములకు |
| 3వ భాగం | మేనమామకు | 8వ భాగం | సోదరులకు |
| 4వ భాగం | శిశువుతల్లికి | 9వ భాగం | శ్వశురునకు |
| 5వ భాగం | శిశువునకు | 10వ భాగం | సర్వమునకు నష్టము. |

## మూలా నక్షత్రమునందలి 12 భాగములు

| | | | |
|---|---|---|---|
| 1వ భాగం | తండ్రికి | 7వ భాగం | పినతల్లికి |
| 2వ భాగం | తల్లికి | 8వ భాగం | భార్యకు |
| 3వ భాగం | అన్నదమ్ములకు | 9వ భాగం | శిశువునకు |
| 4వ భాగం | అక్కచెల్లెళ్ళకు | 10వ భాగం | దారిద్ర్యం |
| 5వ భాగం | మామగారికి | 11వ భాగం | రాజ్యలాభం |
| 6వ భాగం | మేనత్తకు | 12వ భాగం | భాగ్యము కలుగును. |

## మాస ఫలము చూచు క్రమము

శుద్ధపాడ్యమి ప్రవేశమునందేనక్షత్రమగునో ఆనక్షత్రము లగాయతు తన నక్షత్రము వరకు లెక్కించి ఆ సంఖ్యను 9చే భాగించగా మిగిలిన శేషము 1 ప్రయాణము, 2 మృష్టాన్న భోజనము, 3 తనుతాపము, 4 శౌర్యము, 5 విద్య, 6 వస్త్రలాభము, 7 శోకము, 8 అనంత పుణ్యము, 9 మహాఫలము కలుగును.

## తారాబలము చూచు క్రమము

జన్మ నక్షత్రములగాయతు నిత్యనక్షత్రము వరకు లెక్కపెట్టి 9చే భాగించగా మిగిలిన భాగము 1 జన్మతార, 2 సంపత్తార, 3 విపత్తార, 4 క్షేమతార, 5 ప్రత్యక్తార, 6 సాధనతార, 7 నైధనతార, 8 మిత్రతార, 9 పరమమైత్రతార అగుచున్నది.

ఈ తారలలో 2-4-6-8-9 తారలు మంచి ఫలమును, 1-3-5-7 తారలు దుష్టఫలమును యిచ్చును.

## చంద్రబలమును చూచు క్రమము

తన జన్మరాశి లగాయతు చంద్రుడున్న రాశివరకు గణన చేయగా 1-3-6-7-10-11 రాశులయందు చంద్రుడుండగా ధనలాభము, కార్యసిద్ధి, శుభమునిచ్చును. మిగతా రాశులయందు కార్యవిఘ్నము కలుగును. విశేషమేమనగా శుక్లపక్షమున 2,5,9 రాశులయందును, కృష్ణపక్షమున 4, 8, 12 రాశులయందును వుండగా తల్లి కుమారుని రక్షించినట్లు చంద్రుడు మనలను రక్షించును. శుక్ల పక్షమున చంద్రబలమున్ను, కృష్ణపక్షమున తారాబలమున్ను ముఖ్యముగా జూచుచుండవలయును.

## పురశ్శుక్ర దోషము

నూతన వధువు, గర్భిణీ స్త్రీ, శిశు సహిత యగు స్త్రీయును శుక్రుడు తూర్పు దిక్కుననున్నప్పుడు, పశ్చిమదిక్కునుండి వాయువ్య దిక్కునకు, ఉత్తరమునకు, ఈశాన్యమునకు, తూర్పు దిక్కునకు ప్రయాణం చేయగూడదు. పశ్చిమదిక్కునందు శుక్రుడున్నప్పుడు తూర్పు దిక్కునుండి ఆగ్నేయమునకు, దక్షిణమునకు, నైఋతి దిక్కునకు పశ్చిమమునకు వెళ్ళగూడదు. ఈ పురశ్శుక్ర దోషము ఏకగ్రామమందు, దుర్భిక్షమందు, రాజవిడ్వరము వచ్చినపుడు, వివాహమునకు, తీర్థయాత్రలకు వెళ్ళునపుడు దోషము కాదు. భారద్వాజాంగీరస భృగ్వత్రివత్స కాశ్యపవాసిష్ఠ గోత్రజుల వారిని ఈ పురశ్శుక్ర దోషమెప్పుడును బాధింపదు.

## పొయ్యి వేయుటకు

కృత్తిక, విశాఖ, జ్యేష్ఠ, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, శతతార, రేవతి ఈ నక్షత్రములందును, ఆది, మంగళ, శనివారములందును ౩-౫-౧౦-౧౩-౧౫- తిథులయందును, వృషభ, మిథున, కన్యా, తులా, ధనుర్మీన లగ్నములందును శుభము.

## స్త్రీ ప్రథమ రజోదర్శన గుణదోషములు

**తిథులు:** పాడ్యమియందు మహాపాపినియును, విదియయందు పుత్రవతియును, తదియయందు సౌఖ్యవతియును, చవితియందు వృషలియును, పంచమియందు శుభప్రదురాలును, షష్ఠియందు వికృత సంచారిణియును, సప్తమియందు శుభ ప్రదురాలును, అష్టమియందు వికృత సంచారిణియును, నవమియందు విశేషకష్టియును, దశమియందు పుత్రవతియును, ఏకాదశియందు శుచికలదియును, ద్వాదశియందు పతిని దూషించునదియును, త్రయోదశియందు పుత్రవతియును, చతుర్దశియందు కోపనయును, పూర్ణిమా_మావాస్యల యందు దుష్టచారిణియును అగును.

**నక్షత్రములు :** భరణి, ఆశ్లేష, పూర్వఫల్గుని, పూర్వాషాఢ, పూర్వాభాద్ర యీ నక్షత్రముల 1 వ పాదం భర్తృనాశనమును, 2 వ పాదం పుత్రనాశనమును, 3 వ పాదం ధన నాశనమును, 4 వ పాదం అశుభమును కలిగించును. మరియు కృత్తిక, ఆర్ద్ర, పునర్వసు, మఘ, జ్యేష్ఠ యీ నక్షత్రముల యొక్క 1 వ పాదం మంగళము గలిగించును. 2 వ పాదమునన్నైన 25గురికి భోజనము పెట్టవలయును. 3,4 పాదములందును, ఆది మంగళ శని వారములయందును, దుష్టకాలములయందును, దుష్టతిథులయందును దుష్టయోగములయందు రజస్వల అయినయెడల యథావిధిగా శాంతి చేయవలెను.

## బల్లి పాటునకు ఫలము

శిరస్సు - కలహము, ముఖము - బంధు దర్శనము, కనుబొమ్మల నడుమ - రాజానుగ్రహము, పై పెదవి - ధనవ్యయము, క్రింది పెదవి - ధనలాభము, ముక్కు చివర - కోపము, కుడిచెవి - దీర్ఘాయువు, ఎడమచెవి - వర్తకలాభము, నేత్రము - ఖైదు, గడ్డము - రాజదండనము, నోరు - భయము, కంఠము - శత్రు హాని, కుడి భుజము - స్త్రీ సంగమము, కుడి ముంజేయి - కీర్తి, ఎడమ ముంజేయి - రోగము, స్తనయుగ్మము - దోషము, ఉదరము - ధాన్యలాభము, రొమ్ము, నాభి - ధనలాభము, ప్రక్కలు - సుఖము, పాదము - ప్రయాణము, వీపు - శుభము, గోళ్ళు - ధన వ్యయము, లింగము - దారిద్ర్యము, జుట్టుకొన - మృత్యువు,

**ఈ ప్రదేశములయందు తొండ ప్రాకినను ఫలమిట్లేనని తెలియవలయును.**

## వాస్తు పురుష స్థితి

భాద్రపదాది 3 మాసములు తూర్పు శిరస్సుగాను, మార్గశీర్షాది 3 మాసములు దక్షిణ శిరస్సుగాను, ఫాల్గునాది 3 మాసములు పశ్చిమ శిరస్సుగాను, జ్యేష్ఠాది 3 మాసములు ఉత్తర శిరస్సుగాను, ఎడమ ప్రక్కగా వాస్తు పురుషుడు ఇంటి నిమిత్తము తీసుకొను స్థలమందు శయనించును. కావున అతని దృష్టి ప్రసరించిన దిక్కునను, పాదములందును గృహమును కట్టగూడదు.

## మృతికి దుష్ట నక్షత్రములు

భరణి, కృత్తిక, రోహిణి, పునర్వసు, మఘ, ఉత్తర, చిత్ర, విశాఖ, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, శతతార, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి - ఈ నక్షత్రములయందును, ఆది, మంగళ, శుక్రవారముల యందును, ౧-౨-౩-౬-౧౧-౧౨-౧౩-౧౪-౩౦ ఈ తిథుల యందును మృతి సంభవించిన గృహమునకు దోషము. కేవలం తిథివల్ల దోషం లేదు. తిథి వారముల వల్ల స్వల్పదోషము. తిథి నక్షత్రముల వల్ల అర్ధదోషము. తిథి వార నక్షత్రముల వల్ల సంపూర్ణదోషము గలుగును. మృగశిర, చిత్ర ఇవి ద్విపాద నక్షత్రములు. ఈ నక్షత్రములయందు మృతి సంభవించిన 3 మాసములున్ను, భరణి, రోహిణి, మఘ, ధనిష్ఠా పంచకములు వీటియందు 6 మాసములున్ను గృహమును వదలవలయును.

## ఆశౌచ ప్రకరణము

శిశువు ప్రాణములతో పుట్టి నాభిచ్ఛేదనకు పూర్వమందు మరణము నొందెనేని తల్లికి పది దినములు మృతాశౌచమున్నూ, తండ్రికి, సోదరులకు మూడు దినములు జాతాశౌచము, మృతాశౌచము స్నానమాత్రముననే శుద్ధి. మృతప్రసవమైనను, నాభిచ్ఛేదనమయిన తరువాత శిశువు మరణించినను తండ్రి సోదరులకు జ్ఞాతులకు సంపూర్ణ జాతాశౌచము. మృతాశౌచము స్నానమాత్రం. తల్లికి దశరాత్ర మృతాశౌచము. పది దినముల లోపల శిశువు మరణించినయెడల జ్ఞాతులకు తల్లిదండ్రి, సోదరులకు, జాతాశౌచము. జననాది శేషముతో శుద్ధి. మృతాశౌచము స్నానమాత్రము. దంతజనన పర్యంతము జ్ఞాతులకు స్నానమాత్రము, చూడాకర్మ పర్యంతం ఒక దినము, ఉపనయన పర్యంతము, మూడుదినములు ఆశౌచము. వివాహమయిన స్త్రీ తండ్రియింట మరణించిన తల్లిదండ్రి, సోదరులు పెండ్లికాని పడుచులకు మూడుదినములు ఆశౌచము. పెండ్లియైన స్త్రీ తల్లిదండ్రుల మరణమునందు దశరాత్రములోగా త్రిరాత్రాశౌచము పట్టవలెను. సోదరీసోదరులకు సన్నిధానాసన్నిధానములయందు త్రిరాత్రాశౌచము. మాతామహుడు, మాతామహి, పినతల్లి పెత్తల్లులు, మేనమామ మేనత్త, దౌహిత్రుడు, పినతల్లి పెత్తల్లి బిడ్డలకు, మేనత్త మేనమామ బిడ్డలకు పురుష పర్యాయములో సన్నిధానమందు త్రిరాత్రము. గ్రామాంతరమునందు పక్షిణి. పక్షిణీ కాలాతి క్రమణమందు గ్రామాంతరమున వింటే ఆ పగలు, రాత్రివింటే ఆ రాత్రి ఉండి స్నానం. మేనమామ భార్యకు సన్నిధానంలో స్నానం. భార్య ఉండగా, సంతానం ఉండగా అత్తమామలు మరణించినయెడల సన్నిధానమందు మూడుదినములు, అసన్నిధానమందు పక్షిణి. భార్యసంతానము లేనియెడల సామీప్యమున ఒకరాత్రి అసన్నిధానమందు స్నానం.

సవతి తల్లి సోదరీ సోదరులు మరణించినపుడు సమీపమునందు ఒక దినము. దేశాంతరమందు స్నానమాత్రం. సవతి కూతురు మరణించినపుడు సవతితల్లికొక దినము. సవతి తల్లి పోయినపుడు సవతి కూతురికొక దినము ఆశౌచము. దూరమందైనయెడల స్నానముతోసరి. అల్లుని మరణముసమీపమునందు జరిగినయెడల అత్తమామలకు మూడుదినములు. గ్రామాంతరమందు పక్షిణి. జ్ఞాతులకు దశాహానంతరమందు మూడు మాసముల వరకు మూడుదినములు, ఆరుమాసముల వరకు పక్షిణి, సంవత్సర పర్యంతం ఒక రాత్రి ఆశౌచము. మహానది అడ్డమున్నయెడల అతిక్రాంతాశౌచము, త్రిరాత్రము లేదు. జ్ఞాతులకు త్రిరాత్రాతిక్రమణమందు స్నానమాత్రమే.

తల్లిదండ్రులు చనిపోయినపుడు వారికి ప్రేతక్రియలు జరగనియెడల తాము బ్రతికియుండు కాలములో ఎన్నడు విన్నను 11 దినములు ఆశౌచము. ప్రేతకృత్యములు జరిగినయెడల 20 సంవత్సరములలో నెపుడు విన్నను 10 దినములు ఆశౌచము. అనేక ఆశౌచ సన్నిపాతమందు దశరాత్ర మృతాశౌచము పడుచుండగా దశరాత్ర మృతముగాని, త్రిరాత్రమృతముగాని సంభవించెనేని ప్రథమాశౌచముచే నివృత్తి. దశరాత్రజాతాశౌచమును పట్టుచుండగా త్రిరాత్రమృతాశౌచము వచ్చినను జాతాశౌచముచే నివృత్తి గాని మృతాశౌచముచే అధిక జాతాశౌచము పోదు. దశరాత్రమృతాశౌచము మధ్య దశరాత్రజాతాశౌచము వచ్చిననూ మృతాశౌచము చేతనే నివృత్తి. దశరాత్రమృతాశౌచము నవలంబించియుండగా దశమదినమున రాత్రి వేరొక మృతాశౌచము వచ్చినయెడల మొదటి యాశౌచము పూర్తియైన పిమ్మట అనగా పదియవ రాత్రి 3వ యామమందు వినిన 9 దినములు మృతాశౌచము పట్టవలెను. చరమదినాష్టమయామమనగా సూర్యోదయాత్పూర్వమున వేరొక పూర్ణ మృతిని వినిన 3 దినములాశౌచము. పుత్ర పుత్రికా జనన సంబంధియగు జాతాశౌచము నవలంబించియుండగా వేరొక మృతాశౌచము వచ్చినను మృతాశౌచము వదిలి జాతాశౌచమునే పట్టవలెను.

## పూర్ణాహుతి కాలము

పూర్ణాహుతి చేయదలచిన రోజున శుక్లప్రతిపదాదిగా తిథులున్నూ భానువారాదిగా వారములున్నూ 1 కలిపిన మొత్తమును నాల్గుచే భాగించగా 1, 2 మిగిలిన అగ్నిహోత్రుడు పాతాళమందుండును. కనుక ప్రాణ, ధన హానిన్ని 3, 4 మిగిలిన అగ్నిహోత్రుడు భూమియందుడును గనుక సౌఖ్య, ధనలాభమున్ను కలుగును. సూర్యుడున్న నక్షత్రము మొదలు నిత్యనక్షత్రము వరకు 'రవి, బుధ, శుక్ర, శని, చంద్ర, కుజ, గురు, రాహుకేతువు"లగును. రవ్యాదిగ మూడేసి నక్షత్రముల చొప్పున లెక్కించగా శుభగ్రహ సంబంధమైన నక్షత్రము శుభమును, క్రూరగ్రహ సంబంధమైన నక్షత్రము అశుభమును కలుగజేయును.

## పంచక రహితము - తద్వివరము

శుక్ల ప్రతిపదాది తిథులను ఆదివారాది వారములను అశ్విన్యాది నక్షత్రములను మేషాది లగ్నములను లెక్కించి కలిపిన సంఖ్యను 9చే భాగించగా 3-5-7-9 మిగిలిన పంచక రహితము. 1-2-4-6-8 మిగిలిన క్రమముగా మృత్యు, అగ్ని, రాజచోర రోగపంచకమగును. కృష్ణపక్షమున కృష్ణ ౧ మొదలుకొనిగూడ తిథిసంఖ్యను లెక్కించవచ్చును. దీనిని పక్షాది పంచక రహితమందురు. మరియు గత తిథిసంఖ్యను లగ్న సంఖ్యను కలిపి 9చే భాగించుట, ఇది ముహూర్తమార్తాండ సమ్మతము. తిథి వార నక్షత్ర లగ్న సంఖ్యలను గూడిన సంఖ్యలో మేషాదులకు ధృవకమును గూడి 9చే భాగించిన దానిని ధ్రువకరహితమందురు. ఈ ధ్రువకములు 2 విధములుగ ప్రసిద్ధిలోయున్నవి. ధ్రువకములలో గూడ ఇంకనూ భేదములు కలవు. వేద ౪, బాణ ౫, ఋతుః ౬, పంచ ౫, వేదా ౪, స్త్రీణి ౩, ద్వి ౨౪, చంద్రమాః ౧౪, ఆకాశ ౦, ఇన్దు ౧, ద్వయ ౨, త్రీణి ౩ మేషాది ధ్రువకాస్స్మృతాః ॥ మేషాది రాశులకు ధ్రువకములు.

**ప్రకారాంతరము :** - వసు ౮, శైల ౭, పురా ౩, రంధ్ర ౪, గజ ౮, వేదా ౪, ర్క ౧౨, శైలకాః ౭ । నగా ౭, బ్ధి ౪, వసు ౮, నేత్రాణి ౨, మేషాది ధ్రువకాస్స్మృతాః ॥ అనియున్నది. సుముహూర్తములకు గాని ప్రయాణాదులకు గానీ, పంచకశుద్ధి, తారాబల చంద్రబలములు ఆవశ్యకములు.

## గృహ ప్రవేశాదులకు వృషభ కలశ చక్రశుద్ధి

సూర్యుడున్న నక్షత్రము మొదలు చంద్రుడున్న నక్షత్రము వరకు అభిజిత్సహితముగా గ్రహించవలయును.

| వృషభ చక్రము | కలశ చక్రము |
|---|---|
| రవి నక్షత్రము మొదలు | రవి నక్షత్రము మొదలు |
| ౩ మృత్యువు | ౧ శిరశ్ఛేదము |
| ౪ దుర్దశ | ౪ ప్రవాసము |
| ౪ స్థైర్యము | ౪ అభయము |
| ౩ భ్రమణము | ౪ ధాన్యము |
| ౪ సంపద | ౪ నిర్ధనము |
| ౪ ధాన్యము | ౪ గర్భస్రావము |
| ౩ సంపద | ౩ శ్రీకరము |
| ౩ పశువృద్ధి | ౩ శతాయుష్యము |

వృషభ చక్రమును అభిజిత్సహితముగాను, కలశచక్రమును అభిజిత్తు లేకుండాను గ్రహించవలయును. అభిజిత్తు (ఉ.షా ౪ పాదము) ఈ 2 చక్రములు ద్వంద్వయుద్ధము, సంగ్రామము, నృపయాత్రానివృత్తి ప్రవేశ, నూతన గృహప్రవేశ, కృషి, భూమి ప్రవేశములందున పర్వత, పట్టణ, దేవాలయ, క్షేత్రారామ నూతన ప్రవేశాదులయందును చూడదగియున్నవి.

## పాణిగ్రహణోపయోగ పంచకూట ప్రసూతి రజస్వలా శాంతి నక్షత్ర విమర్శన చక్రము

| నక్షత్రం | పాదము | గణ కూటము | పార్శ్వ మధ్య | యోని కూటం | రాశి కూటం | | ప్రసూతి శాంతి | రజస్వల శాంతి |
|---|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | స్వర్ణం | దేవ | పార్శ్వ | అశ్వం | స్త్రీ రాశ్యాది ౨ | మృత్యువు | ౧ పా - శాంతి | శుభం |
| భరణి | స్వర్ణం | మనుష్య | మధ్య | గజం | | | ౩ పా - శాంతి | ౧౦ మాస శాంతి |
| కృత్తిక | స్వర్ణం | రాక్షస | అంత్య | అజం | పురుష రాశ్యాది ౧౨ | | ౩ పా - శాంతి | శాంతి ౪మా |
| రోహిణి | స్వర్ణం | మనుష్య | అంత్య | సర్పం | స్త్రీ ౧౨ | ఆయుర్వృద్ధి | శాంతి | శుభం |
| మృగశిర | స్వర్ణం | దేవ | మధ్య | సర్పం | పురుష ౨ | | శుభం | శుభం |
| ఆర్ద్ర | రజతం | మనుష్య | పార్శ్వ | శునకం | స్త్రీ ౩ | దుఃఖం | సామాన్య శాంతి | శాంతి ౬మా |
| పునర్వసు | రజతం | దేవ | పార్శ్వ | పిల్లి | పురుష ౧౧ | కేచిత్సుఖం | శుభం | శాంతి ౯మా |
| పుష్యమి | రజతం | దేవ | మధ్య | మేషం | స్త్రీ ౧౧ | సుఖం | ౨,౩ పా - శాంతి | శుభం |
| ఆశ్లేష | రజతం | రాక్షస | అంత్య | పిల్లి | పురుష ౩ | కేచిద్దుఃఖం | శాంతి | శాంతి ౬మా |
| మఘ | రజతం | రాక్షస | అంత్య | మూషక | స్త్రీ ౪ | దారిద్ర్యం | ౧ పా - శాంతి | శాంతి ౬మా |
| పూర్వఫల్గుని | రజతం | మనుష్య | మధ్య | మూషక | పురుష ౧౦ | | శాంతి | శాంతి ౭మా |
| ఉత్తరఫల్గుని | రజతం | మనుష్య | పార్శ్వ | వృషభ | స్త్రీ ౧౦ | ధనలాభం | ౧ పా - శాంతి | శుభం |
| హస్త | రజతం | దేవ | పార్శ్వ | మహిష | పురుష ౪ | | శాంతి | శుభం |
| చిత్ర | రజతం | రాక్షస | మధ్య | వ్యాఘ్ర | స్త్రీ ౯ | అశుభం | ౧,౨ పా -శాంతి | శుభం |
| స్వాతి | రజతం | దేవ | అంత్య | మహిష | పురుష ౮ | | ౩ పా - శాంతి | శుభం |

